**Sachcha Deen-2**
(Telugu)

# ఇస్లాం ప్రబోధిని

## (రెండవ భాగం)

మూలం
**అఫ్జల్ హుసైన్**

అనువాదం
**అబ్బాదుల్లా**

# విషయ సూచిక





رَّبِّ زِدْنِيْ عِلْمًا

ఓ ప్రభూ!
నాకు మరింత
జ్ఞానం ప్రసాదించు

(దివ్యఖుర్ఆన్ 20 : 114)

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# 1. హమ్ద్

అల్లాహు అక్బర్ అల్లాహు అక్బర్
అల్లాహు అక్బర్ అల్లాహు అక్బర్
అల్లాహ్‌యే అందరి దైవం
ఆయనకే చెల్లు మా దాస్యం
చేశాడు సృష్టి అంతా ఆయనే
ఇలలోన ఇచ్చాడు మనకంతా ఆయనే
అల్లాహు అక్బర్ అల్లాహు అక్బర్
అల్లాహు అక్బర్ అల్లాహు అక్బర్
తారల్లో చందమామ ఇచ్చాడు
పుష్పాలతో పూవనాలు నింపాడు
కొండలపై చెలమలు ఉంచాడు
నేలపై నదులు ప్రవహింపజేశాడు
భూమ్యాకాశాలలో ఎటు చూచినా ఉన్నాయి
మనోహర దృశ్యాలే కంటి కగుపడుతున్నాయి
అల్లాహు అక్బర్ అల్లాహు అక్బర్
అల్లాహు అక్బర్ అల్లాహు అక్బర్
అన్నాదమ్ములు అమ్మానాన్నలు ఇచ్చాడు
వారందరితో గృహం స్వర్గధామం చేశాడు
పండ్లు స్వీట్లు వారిస్తారు మాకు
ప్రతిక్షణం ఆనందం కలుగుతుంది వారితో మాకు

# 2. నాత్-యె-షరీఫ్

ధర్మం తెలియని కాలంలో
దైవాన్ని మరచిన విశ్వంలో
మహామనిషి వచ్చారు, వచ్చారు
స్ఫూర్తితో ధర్మ ప్రబోధన చేశారు
ఎవరాయన?
మన ఆదర్శమూర్తి ముహమ్మద్
సల్లల్లాహు అలైహి వసల్లమ్
మౌఢ్యం దౌష్ట్యాలతో పోరాడారు
హింసా దౌర్జన్యాలు సహించారు
నిత్యం సత్యం పలికారు
జగతిని వెలుగుతో నింపారు
ఎవరాయన?
మన విశ్వ నాయకుడు ముహమ్మద్
సల్లల్లాహు అలైహి వసల్లమ్
మన ప్రభువాజ్ఞ వినిపించారు
మానవుణ్ణి మనిషిగ మలిచారు
ఖుర్ఆన్ గ్రంథం చేపట్టారు
ధరణిలో దైవధర్మం స్థాపించారు
ఎవరాయన?
మన ప్రియ ప్రవక్త ముహమ్మద్
సల్లల్లాహు అలైహి వసల్లమ్

# 3. ఇస్లాం వల్ల మనకు చేకూరే లాభాలు

ఇస్లాం అంటే అల్లాహ్ ముందు తలవంచడం. ఆయన చెప్పింది వినడం. ఆయన చూపిన దారిలో నడవడం. మనందరిని అల్లాహ్‌యే సృష్టించాడు. అన్ని వస్తువుల్ని ఆయనే చేశాడు. అందరి అవసరాల్ని ఆయనే తీరుస్తున్నాడు. ఆయన ఇచ్చినదే అందరు అనుభవిస్తున్నారు. అందరినీ ఆయనే బ్రతికిస్తున్నాడు. అందుచేతనే అందరు ఆయనకే దాసులు. సృష్టిలో ఉన్నవన్నీ ఆయన ఆధీనంలోనే ఉన్నాయి. భూమ్యాకాశాలు, సూర్యచంద్ర నక్షత్రాదులు, అన్నీ ఆయన ఉత్తర్వుల ననుసరించే పనిచేస్తున్నాయి. ఆయన ఆజ్ఞల వల్లనే గాలులు వీస్తున్నాయి, వర్షాలు కురుస్తున్నాయి. ప్రతి చిన్న పెద్ద వస్తువు ఆయన ఆజ్ఞలకే కట్టుబడి ఉంది. ఆయన హుకుం ప్రకారమే అన్నీ నడుస్తున్నాయి. మనం కూడా అలాగే నడుచుకోవాలి. అందులోనే మన శ్రేయం ఉంది. అల్లాహ్ చెప్పిన ప్రకారమే నడచుకోవడం, ఆయన చూపించిన బాటనే అనుసరించాలి. అదే సన్మార్గం. అంటే ఇస్లాంను అనుసరించడం అన్నమాట. ఇస్లాం ప్రకారం జీవితం గడిపే వ్యక్తి ముస్లిం అవుతాడు. ఇహపరాల లాభాలన్నీ ఇస్లాంలోనే ఉన్నాయి. ఇస్లామీయ నడవడికను పాటించే వ్యక్తిలో ఎన్నో మంచి గుణాలు కలుగుతాయి. ప్రపంచంలో ఆ వ్యక్తి శ్రేష్టమైన వ్యక్తిగా పరిగణించబడతాడు. అతనిలో అనేక మంచి గుణాలు కలుగుతాయి. ఇతరులు ఏ ఒక్క సుగుణంలో కూడా అతనితో పోటీపడలేరు.

ఇస్లాంను జీవిత విధానంగా ఎన్నుకొని నడచుకొనే వ్యక్తిలో అలవడే సుగుణ సముదాయాన్ని తెలియపరుస్తున్నాం.

1. అతను సత్ప్రవర్తన, పరిశుద్ధత కలవ్యక్తి అవుతాడు. చెడు దరిదాపులకు కూడా పోడు. మంచి పనులు చేయడం అంటే అలాహ్‌కు ఇష్టమని చెడు పనులు చేయడం అంటే ఆయనకు ఆగ్రహం కలుగుతుందని అతనికి తెలుసు. ఎప్పుడైన ఎక్కడైన పొరబాటుతో ఏదైనా తప్పు దొర్లితే అతను వెంటనే పశ్చాత్తాపపడి, క్షమాపణ వేడుకొంటూ మళ్ళీ సత్ప్రవర్తన కలవాడై ఉంటాడు.
2. అతడు నిత్యం సత్యం పలుకుతాడు. అబద్ధం పలుకకుండా జాగ్రత్త పడతాడు. అసత్యం అన్ని చెడులకు మూలమని అతనికి బాగా తెలుసు.
3. అతను ఇచ్చిన మాటను జవదాటడు. ఏది ఏమైనా ఇచ్చిన మాటను నెరవేరుస్తాడు. అందుచేతనే ప్రజలు అతని వాగ్దానాలను నమ్ముతారు.
4. అతను ఏ పని చేసిన చక్కగ చేస్తాడు. ఎవరిని మోసం చెయ్యడు. నమ్మకద్రోహం చెయ్యడం. ప్రజలకు మోసం చేయవచ్చు గాని, అల్లాహ్ నుండి ఏ మాటను కూడా దాచలేమని అతనికి బాగా తెలుసు. మానవుని మనస్సులో ఉండే మర్మం కూడా అల్లాహ్ తెలుసుకొంటాడని అతనికి తెలుసు.
5. అతను ఆత్మసంతృప్తి కలవాడై ఉంటాడు. ఇతరుల సిరిసంపదల్ని మనసును ఆకర్షించే మంచి వస్తువులను చూచి పేరాశకుపోడు. ఎవరి ఎదుట చేజాపి యాచించడు.

6. అతడు సాహసోపేతుడు. ధైర్య సంపన్నుడు. అల్లాహ్‌కు తప్ప ఇతరులెవ్వరికి భయపడడు. అల్లాహ్ ఆజ్ఞలేనిదే ఎవరు ఏమీ చేయలేరని అతనికి బాగా తెలుసు.

7. అతను బంధువులతో సత్సంబంధాలు కలిగి ఉంటాడు. తల్లిదండ్రుల హక్కుల్ని గ్రహిస్తాడు. అన్నాతమ్ముళ్ళ, అక్కచెల్లెండ్ల పట్ల తన బాధ్యతలు నెరవేరుస్తాడు. ప్రతి బంధువుకు తనకు చేతనైనంత సహాయం చేస్తూ ఉంటాడు.

8. అతను ఇతరులకు కష్టాలు వచ్చినప్పుడు వారిని వీలైనంత వరకు ఆదుకుంటాడు. బీదసాదలు, బాధాగ్రస్తులు, వితంతువులు, అనాధల పట్ల దయచూపుతాడు. వారికి సహాయపడుతూ పుణ్యం సంపాదించుకొంటాడు.

9. అతను అందరితో కలుపుగోలుతో ఉంటాడు. పెద్దలను గౌరవిస్తాడు. పిన్నలను ప్రేమతో పలుకరిస్తాడు. అందుచేతనే పెద్దలు, పిన్నలు, ధనవంతులు, నిరుపేదలు అందరు అతనంటే ఇష్టపడతారు. ఇతరుల మనస్సులను నొప్పించకుండా ఉంటాడు.

10. ఉపకారికి మహోపకారం చేయడం అతని లక్ష్యం. ఎవరైనాసరే ఏదైనా మేలు చేకూర్చుతే ఎన్నటికీ మరువకుండా ఉంటాడు. చేజిక్కిన అవకాశాన్ని ఉపయోగించుకొంటూ అంతకంటే ఎక్కువ మేలు చేస్తాడు.

11. లజ్జ, బిడియం, అతనిలో మూర్తీభవిస్తాయి. అశ్లీల పనులంటే అతని కెంతో అసహ్యం. ఇతరుల గౌరవ మర్యాదలను తన గౌరవ మర్యాదలుగా భావించి వాటిని కాపాడుతాడు.

12. అతను అందరి మేలు కోరుతాడు. ఎవరి చెడును కోరడు. ఎవరినీ ద్వేషించడు. స్వయంగా అతను ఇతరుల ధనమాన ప్రాణరక్షణ కోసం కృషి చేస్తూంటాడు.

13. అతను అందరితో న్యాయంగా వ్యవహరిస్తాడు. ఎవరిపై దౌర్జన్యం చెయ్యడు. ఎవరినీ వేధించడు. ఎవరి పట్ల కూడా పక్షపాతం చూపడు. న్యాయం, ధర్మం విషయంలో తన వారైనాసరే, పరాయివారైనా సరే సమానంగా చూస్తాడు.

14. అతను నిక్కుతూ నీలుగుతూ నడువడు. తానే మిన్న అన్న తలంపుతో విర్రవీగడు. తనలో ఉన్న మంచిని చూసుకొని, లేదా తాను సాధించిన ఘనకార్యాన్ని తలచుకొని గర్వపడడు. స్తుతి, స్తోత్రాలన్నింటికీ అల్లాహ్ మాత్రమే అర్హుడని, ఆయనే అందరి కంటే గొప్పవాడని అతనికి తెలుసు. మానవులందరు బలహీనులు, శక్తి లేనివారు, అందరు అల్లాహ్‌కు దాసులు. వారి వద్ద ఉన్నది కేవలం అల్లాహ్ ప్రసాదించినదే తప్ప, మరొకటి కాదని అతను విశ్వసిస్తాడు.

15. అతను ఏ వస్తువును కోరుకుంటాడో అదే ఇతరుల కోసం కూడా కోరుతాడు. ఎవరిని అధములని భావించడు. ఎవరిని అగౌరవపరుచడు. పరుల సొమ్ము దోచుకోడు. ఎవరినీ అప్రతిష్ఠపాలుజేయడు. ఎవరిని పరిహసించడు, కించపరచడు. వీపు వెనుకాల ఎవరి తప్పులను ప్రస్తావించడు. అనుమతి లేనిదే ఇతరుల వస్తువులను ముట్టడు కూడా. ఎవరైనా నా పట్ల అగౌరవంగా ప్రవర్తిస్తే నేనిష్టపడను కదా! అలాంటప్పుడు నేనెలాగ ఇతరులను అగౌరవపరచగలనని ఆలోచిస్తాడు.

ఇస్లాం వల్ల ఒక వ్యక్తిలో సమకూరే సద్గుణ సముదాయాన్ని ప్రస్తావించడమయింది. అందుచేతనే అల్లాహ్ మన కోసం ఇస్లాం ఇష్టపడ్డాడు. ఇదే సత్య ధర్మమని ప్రకటించాడు. ఎవరయితే ఈ ధర్మాన్నను సరించి జీవితం గడుపుతారో వారికి విజయపరంపరల శుభవర్తాలనిచ్చాడు అల్లాహ్.

**'అన్తుముల్ ఆలౌన ఇన్‌కున్తుమ్ మోమినీన్'** అని దివ్యఖుర్‌ఆన్ ఘోషిస్తుంది. "మీరు నిజంగా విశ్వాసవంతులయితే మీరే ఆధిక్యత వహిస్తారు." ఇక ఆలోచించండి! ఇన్ని సద్గుణాలు కల వ్యక్తి పైగా ఇతరులెవరూ పోటీపడలేనంత సద్గుణసంపత్తి కల వ్యక్తి ప్రతిచోట విజయం, ఆధిక్యతలు సాధించలేకపోతే మరెవరు సాధించగలరు?

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి.**

1. ఇస్లామ్ అంటే ఏమిటి?
2. మనందరి మేలు ఏ విషయంలో ఉంది.
3. ఒకర్ని కష్టాల్లో చూసి మీరేం చేస్తారు?
4. ఎవరయినా మనకు మేలు చేస్తే మనం వారి పట్ల ఎలా వ్యవహరించాలి?
5. ఇస్లామ్‌ను అనుసరించే వారికి అల్లాహ్ ఏమని శుభవార్తనిచ్చాడు?

**(ఆ) క్రింద ఇస్లామ్ ప్రకారం నడుచునేవారి సదాచరణలు, దుర్వర్తనుల దురాచరణలు పేర్కొనడం జరిగింది. సదాచరణలు, దురాచరణలు పేర్కొనడం కోసం బ్రాకెట్లు ఇవ్వబడ్డాయి. వాటిలో ఏది సదాచరణో ఏది దురాచరణలో వ్రాయండి?**

1. వాగ్దానం చేసి భంగం చేయడం ( )
2. తప్పు జరిగిన వెంటనే పశ్చాత్తాపపడడం ( )
3. సత్యం పలకడం ( )
4. ఇతరులకున్న మంచి వస్తువులను చూసి దురాశకు లోనవడం ( )
5. బంధువుల పట్ల మంచిగా మెలగడం ( )
6. అల్లాహ్‌కు తప్ప ఎవరికీ భయపడక పోవడం ( )
7. పెద్దలను గౌరవించకపోవడం, పిల్లలను ప్రేమించకుండడం ( )
8. తనలోని ప్రత్యేకతల పట్ల గర్వ పడకపోవడం ( )

**(ఇ) ఇస్లామ్‌ను అనుసరించే వారి కొన్ని సుగుణాలు వ్రాయండి. ఉదాహరణకు : వారు సత్య సంధులు, పరిశుద్ధత పాటిస్తారు.**

1.................................................

2.................................................

3.................................................

4.................................................

## చేయాల్సిన మరి కొన్ని పనులు

ఇస్లామ్‌ను అనుసరించేవారి ప్రత్యేకతలను బాగా ఆకళింపుచేసుకుని వాటిని ఆచరించండి. మీ మిత్రులను కూడా వాటిని ఆచరించమని ప్రోత్సహించండి.

**ఉదాహరణకు :** మీ వీధిలోని పేద, అనాథ, దీనుల యోగ క్షేమాలు తెలుసుకోండి. ఆడుకోవడంలో, చదువుకోవడంలో వారిని మీతో పాటు చేర్చుకోండి.



# 4. విశ్వాసం

దైవానుగ్రహం వల్ల మనం ముస్లిములము. విశ్వాసం, సత్యధర్మం లాంటి మహాభాగ్యం మనకు అల్లాహ్ ప్రసాదించాడు. ఇదే ఆయన మనకిచ్చిన కరుణామృతం. ఈ మహాభాగ్యం మనకు లభించకపోయి ఉన్నట్లయితే మార్గ విహీనులై చెడు దారిలో పడి అంధకార బంధురంలో ఉండేవారం. ఇహపరాలలో నష్టపొయ్యేవారం. ఇస్లాం మన ధర్మం. ఇస్లాం అంటే అల్లాహ్ పట్ల వినయ వినమ్రతలు కలిగి ఆయన ఆజ్ఞలను శిరసావహించడం. అల్లాహ్ ఆజ్ఞలు ఎల్లప్పుడు మంచి పనులు చెయ్యమని, మంచి మాటలు పలుకమని ఉంటాయి. చెడు మాటల నుండి, చెడు పనుల నుండి అల్లాహ్ మనల్ని వారిస్తాడు. అందరి శ్రేయం అల్లాహ్ ఆజ్ఞల్ని అనుసరించడంలోనే ఉంది. మంచి పనులు చేయడం చెడుకు ఆమడ దూరం ఉండడం మన కర్తవ్యం. ఇదే ఇస్లాం. అల్లాహ్ దృష్టిలో కూడా ఇదే సత్యధర్మం. ఇహపరాల సర్వ సుఖాలు ఇస్లాంననుసరించడంలో ఉన్నాయి. అంటే అల్లాహ్ ఆజ్ఞల్ని ఆలకించి పాలించడంలోనే మన శ్రేయం ఉంది. ఇస్లాం చూపించే సత్యం, ఋజుమార్గం వదలి ఎవరూ ముక్తి పొందలేరు. విశ్వాసం (ఈమాన్) అంటే ఏమిటి? పూర్తి నమ్మకం కలిగి ఉండడాన్ని విశ్వాసం అంటారు. ప్రతి ముస్లిం 1) దేవుని ఏకత్వం (తౌహీద్) 2) ప్రవక్తల బోధనలు (రిసాలత్) 3) మరణానంతర జీవితం పట్ల పూర్తి విశ్వాసం కలిగి ఉండాలి. ఈ మూడు ముఖ్య విషయాల్ని త్రికరణ శుద్ధిగా విశ్వసించనంత వరకు ఏ వ్యక్తి కూడా అల్లాహ్ పట్ల విధేయతతో ఋజుమార్గంపై నడువజాలడు. ఇతర మాటల్లో చెప్పాలంటే అలాంటి వ్యక్తి ఇస్లాంను అనుసరించలేడు, ముస్లిం కాజాలడు కూడా. అందుచేతనే మనం ఈ మూడు సూత్రాల పట్ల విశ్వాసం కలిగి ఉన్నాము, వాటిని జాగ్రత్తగా కాపాడుకుంటాం కూడా.

## 1. దేవుని ఏకత్వం (తౌహీద్)

తౌహీద్ అంటే అల్లాహ్ ఒక్కడేనని విశ్వసించి దానికి కట్టుబడి ఉండడం. మన దృఢ విశ్వాసం అల్లాహ్ ఒక్కడే అనేదే. ఆయనే అన్నిటికి సృష్టికర్త. ఆయనే అందరికి ఆహారాన్నిస్తున్నాడు. ఆయనే అందరినీ జీవించగలిగేటట్లు చేస్తున్నాడు. అందరి మరణం ఆయన హస్తగతంలోనే ఉంది. అందరిని పరిపాలించే రాజాధిరాజు ఆయనే. ఈ భూమి, ఆకాశం, సూర్యుడు, చంద్రుడు, గ్రహాలు, నక్షత్రాలు, సజీవ నిర్జీవాలు, ప్రతి చిన్న పెద్ద వస్తువులు ఆయన అధీనంలోనే ఉన్నాయి. పాలకులు పాలితులు, పేదలు ధనికులు, అల్పులు, అధికులు, ప్రతి ఒక్కరూ ఆయన్ను ఆశ్రయించే ఉన్నారు. అల్లాహ్ తన పనుల కోసం ఇతరుల సహాయాన్ని ఆపేక్షించడు. దైవదూతలు, జిన్నులు, ప్రవక్తలు, మహాపురుషులు అందరూ దైవదాసులే, ఆయన సేవ చేస్తున్న వారే. లాభనష్టాలు, గౌరవ అగౌరవాలు, సిరిసంపదలు అన్ని ఆయన చేతుల్లోనే ఉన్నాయి. ఆయన అనుమతించనిదే ఎవరూ ఎవరికీ లాభం చేకూర్చలేరు, నష్టాన్ని కూడా కలిగించలేరు. ఆయన ఇవ్వదలిస్తే ఎవరూ ఆపను ఆపలేరు. నిరాకరిస్తే ఎవరూ ఇవ్వలేరు. ఆయన ఏదైనా మన నుండి తీసుకొనదలిస్తే ఎవరూ మనల్ని రక్షించలేరు. ఆయన మనల్ని పట్టుకొనదలిస్తే ఎవరూ విడిపించనూ లేరు. ఆయన మనల్ని వదలివేస్తే ఎవరూ పట్టుకొనలేరు కూడా. ఏ పనైనా అది చిన్నది కానివ్వండి, పెద్దది కానివ్వండి ఆ పనిలో ఆయనకు భాగస్వాములెవ్వరూ లేరు. ఆయనే అన్ని

చోట్ల ఉన్నాడు. అందరిని చూస్తున్నాడు, ఆలకిస్తున్నాడు కూడా. ప్రతి విషయం ఆయన దృష్టిలోనే ఉంది. ఆయనకు ఏ దోషం లేదు, ఏ లోపం లేదు. అన్ని సుగుణాలు ఆయనలోనే ఉన్నాయి. ఎవరిలోనైనా ఏదైనా మంచి గుణం అగుపిస్తే అది అల్లాహ్ అతనికి ప్రసాదించిన కరుణాకటాక్షాలే.

దేవుని ఏకత్వం పట్ల విశ్వాసం కలిగి ఉండడం వల్ల మనం ముస్లిములమయ్యాము. అందుచేతనే మనం ఆయన దాస్యం చేస్తాం, ఆయన్నే ఆరాధిస్తాం. ఇతరుల ముంగిట చేయిజాచి ఆశించడం కాని, వారికి తల వంచడం కాని ఉండదు. అల్లాహ్‌ను వదలి ఇతరులను యాచించడం కాని, ఆశ్రయించడం కాని లేదు. దుఃఖం కలిగినా, బాధ కలిగినా ఆయన్నే ప్రార్థిస్తాం, సహాయం కోసం అర్థిస్తాం. అల్లాహ్ అనుగ్రహిస్తేనే మనకు శాంతి లభిస్తుందని, ఇతరులెవ్వరూ శాంతిని మనకు ఇవ్వడంగాని, మన నుండి దోచుకోవడం గాని జరుగదని మనకు బాగా తెలుసు. ప్రత్యక్షంగా, పరోక్షంగా మనం భయపడేది అల్లాహ్‌కే. ఆయన అభీష్టానికి వ్యతిరేకంగా ఏ పని చెయ్యం. ఆయన ఇష్టపడని ఏ పనైనా చేస్తే ఆయన పట్టునుండి తప్పించుకులేమని మనకు బాగా తెలుసు.

## 2. ప్రవక్తల పట్ల విశ్వాసం

అల్లాహ్ పంపిన ప్రవక్తల పట్ల విశ్వాసం కలిగి ఉండడం ముస్లిముల ధర్మం. అల్లాహ్ ఇష్టపడే పనులు తెలియజేయడానికి ప్రజలకు చక్కటి జీవిత మార్గం చూపడానికి అల్లాహ్ తన ప్రవక్తల్ని పుడమిపై పంపాడు. ఈ ప్రవక్తల్ని హెచ్చరికలు చేసేవారని, దైవసందేశ ప్రబోధకులని అంటారు. ప్రవక్తలందరూ మానవ మాత్రులే, దైవానికి దాసులు, ఉన్నత విలువలు కల మహా పురుషులు. సత్యసంధులు, ఏ చెడు చేయని పావనమూర్తులు. ఈ మహానుభావులు దేవుడిచ్చిన సందేశాన్ని మానవుల వరకు చేర్చారు. అందులోని ఆదేశాల ప్రకారం జీవితం గడిపి ఆదర్శవంతులయ్యారు. ప్రజల్ని సత్య మార్గంలో నడపడానికి తమ శాయశక్తుల కృషిచేశారు. అజ్ఞానులు ప్రవక్తల్ని అష్టకష్టాల పాలు చేశారు. ప్రవక్తలు ఆ బాధల్ని భరించారు.ఆ బాధలకు ఏ మాత్రం వారు ఖాతరు చేయలేదు. బ్రతికి ఉన్నంత వరకు ప్రజల శ్రేయస్సు కోసం జీవితం గడిపారు. వారు సంకల్ప సాదకులు. దైవదాస్యం చేయాలని, ప్రవక్తల పట్ల విధేయతతో ఉండాలని వారు ప్రజలకు బోధించారు.

ఎందరో ప్రవక్తల్ని ప్రభువు ఈ భూమిపై పంపాడు. వారి ద్వారా ప్రజలకు ఇస్లాం సందేశం అందజేశాడు. అందరికంటే చివర హజ్రత్ ముహమ్మద్ (సఅసం) వచ్చారు. ఆయనపై అల్లాహ్ ఖుర్‌ఆన్ గ్రంథాన్ని అవతరింపజేశాడు. ఆయన తరువాత మరో ప్రవక్త లేడు. ప్రళయం వరకు ఆయన బోధనలను అనుసరించడం లోనే మానవాళికి ముక్తి ఉంది. ప్రవక్తల రాకపై విశ్వాసం ఉంటేనే మనం ముస్లిములమవుతాము.

వచ్చిన ప్రవక్తలందరిని సత్య మార్గ ప్రబోధకులుగా విశ్వసించి వారి పట్ల నిండు గౌరవం కలిగి ఉంటాం. ప్రియప్రవక్త ముహమ్మద్ (సఅసం)ను చివరి ప్రవక్తగా విశ్వసించి ఆయన పట్ల విధేయతతో ప్రవర్తించడంలోనే మన జీవితం సార్థకమవుతుంది.

మన ప్రియప్రవక్త (సఅసం) ఇలా సెలవిచ్చారని తెలుస్తూనే మన మందరం ఆ ఆజ్ఞలను పాటించాలి. ప్రతి మాటలోను, ప్రతి పనిలోను మనం మన ప్రియప్రవక్త (సఅసం) ఆదర్శాన్ని ముందుంచుకోవాలి. ఇతరులను గుడ్డిగా అనుకరిస్తూ మన ఇహపరాల్ని నష్టపరుచుకోకూడదు.

## 3. మరణానంతర జీవితం

మరణించిన తరువాత జీవితం అంతమైనట్లు కాదు. మళ్ళీ మనమంతా సజీవులౌతాము. అదే మరణానంతర జీవితం - ఆఖిరత్. దైవ ఏకత్వం, రిసాలత్ తరువాత ముస్లిముల మూడవ ముఖ్య విశ్వాసం మరణానంతర జీవితం.

ఒక దినం మానవాళి నశిస్తుంది. మరణించి మట్టిపాలౌతుంది. ప్రళయం వస్తుంది. విశ్వం వినాశమవుతుంది. భూమ్యాకాశాలుండవు. సూర్య చంద్రలుండవు. ఆ పిమ్మట అల్లాహ్ అందరిని తిరిగి బ్రతికిస్తాడు. ఇహలోకంలో వచ్చిన వారందరు సజీవులౌతారు. 'హషరు' అనే మైదానంలో అందరూ సమీకరించబడతారు. అక్కడే అల్లాహ్ ప్రతి ఒక్కరి లెక్కతీసికొంటాడు. ప్రతి ఒక్కరి జీవిత చిట్టా తాజాగా అక్కడ చూపించబడుతుంది. ఎవరైతే అల్లాహ్ ఇచ్చిన ఆజ్ఞల్ని పాటించారో, ఆయన పంపిన ప్రవక్తల ననుసరించారో, పుణ్యఫలం సంపాదించారో, చెడుకు దూరంగా ఉన్నారో, వారందరి పట్ల అల్లాహ్ సంతోషపడుతాడు. వారిని స్వర్గప్రవేశం చేయిస్తాడు. స్వర్గం సర్వసుఖాలకు నిలయం. కావలసినదంతా వారికోసం అక్కడ ఉంది. అక్కడ సుఖసౌఖ్యాలు అనూహ్యం.

ఇక అల్లాహ్ పట్ల అవిశ్వాసంతో, అవిధేయతతో జీవితం గడిపిన వారి పరిస్థితి వినండి. వారు దైవ ప్రవక్తల్ని నమ్మిన వారు కారు. వారి మాటల్ని లెక్కచేసిన వారు కారు. చెడు పనులు చేశారు. స్వయంగా మార్గభ్రష్టులయ్యారు. ఇతరుల్ని కూడా భ్రష్టపరిచారు. ప్రపంచంలో అరాచకం, అల్లకల్లోలాలు సృష్టించారు. వారంటే అల్లాహ్‌కు ఆగ్రహం. వారికి కఠిన శిక్ష పడుతుంది. దుర్భర నరకాగ్నిలో వారు పడవేయబడతారు. నరకం నానా యాతనలకు నిలయం. అక్కడ వారు అనేక విధాల దుఃఖానికి గురవుతారు. ఆ దుఃఖం ఊహకు కూడా అందనిది. అల్లాహ్ పట్టు పటిష్టమైంది. ఆయన శిక్షించదలిస్తే రక్షించే నాథుడే ఉండడు. మరెక్కడ ఆశ్రయం కూడా దొరకదు. "ఓ ప్రభూ పొరపాటున మేము చేసిన తప్పులను మన్నించి క్షమించు. మమ్మల్ని నరకాగ్ని నుండి కాపాడు. ఇహపరాల్లో మాకు మంచిని ప్రసాదించు.

رَبَّنَآ اٰتِنَا فِى الدُّنْيَا حَسَنَةً وَّفِى الْاٰخِرَةِ حَسَنَةً
وَّقِنَا عَذَابَ النَّارِ ○

**రబ్బనా ఆతినా ఫిద్దునియా హసనతువ్వ ఫిల్ ఆఖిరతి హసనతువ్వ ఖినా అజాబన్నార్.**

## అభ్యాసం

**(అ) క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి.**

1. అల్లాహ్ మనకు ఏ మహా భాగ్యాన్ని ప్రసాదించాడు.
2. 'ఇస్లామ్' మరియు 'విశ్వాసం' గురించి మీరు ఏం అర్థం చేసుకున్నారు?
3. మనకు విశ్వాస మహాభాగ్యం ప్రాప్తం కాకపోతే ఏమయ్యేది?
4. 'తౌహీద్' (ఏకేశ్వరోపాసన) అంటే ఏమిటి?
5. పరలోకాన్ని విశ్వసించడం అంటే భావం ఏమిటి?
6. "ప్రవక్తల పట్ల విశ్వాసం" గురించి వివరించండి?
7. ప్రవక్తలను విశ్వసించిన తరువాత మనం ఏం చేయాలి?

**(ఆ) ఈ క్రింది ఖాళీలను పూరించండి.**

1. అల్లాహ్ దృష్టిలో ..................................సత్య ధర్మం.
2. ప్రతి ముస్లిమ్........................పట్ల పూర్తి విశ్వాసం కలిగి ఉండాలి.
3. దైవ దూతలు, జిన్నులు, ప్రవక్తలు, మహాపురుషులు అందరూ......................, ఆయన సేవ చేస్తున్నారు.
4. ప్రజలకు చక్కటి జీవిత మార్గం చూపడానికి అల్లాహ్ తన ................................పుడమిపై పంపాడు.
5. ఆయన (స)పై అల్లాహ్......................గ్రంథాన్ని అవతరింప జేశాడు.
6. ఆయన (స) తరువాత మరో......................................రాడు.
7. అల్లాహ్ సంతోషపడిన వారిని ...............................చేయిస్తాడు.

## చేయాల్సిన మరి కొన్ని పనులు

ఈ పాఠంలో ఉన్న దుఆలను వాటి అర్థాలతో సహా కంఠస్తం చేసుకోండి.

# 5. అల్లాహ్ మానవుల కోసం పంపిన గ్రంథాలు

అల్లాహ్ ఎంతో మంచివాడు. అందరిని సృష్టించింది ఆయనే. అనేక వస్తువుల్ని చేశాడు. అవసరమైన అన్ని సామానులు మనకు ఇచ్చాడు. ఇంతటితో చాలక ఏ విధంగా జీవితం గడపాలో ఇల్లు వాకిలి ఏ విధంగా పెట్టుకోవాలో చూపించాడు. ఈ జీవిత విధానాన్ని పాటిస్తే ప్రపంచంలో ప్రశాంతంగా ఉంటూ పరలోకంలో స్వర్గసౌఖ్యాలు పొందవీలుంది. ఈ మాటలే మన ప్రభువు మనకు చూపకుండినట్లయితే మనం దారి తప్పిన ద్రిమ్మరులుగా ఉంటూ ఋజుమార్గం తెలియని వారుగా ఉండేవారం.

చక్కటి మార్గం చూపడానికి అల్లాహ్ అనేక ప్రవక్తల్ని పంపాడు. ఆ ప్రవక్తలపై తన గ్రంథాల్ని అవతరింపజేశాడు. ఆ గ్రంథాలలో అల్లాహ్ మానవులకిచ్చిన హితవులున్నాయి. ప్రవక్తలు స్వయంగా ఆ దైవ బోధనల్ని పాటించేవారు. ఇతరులకు ఆ హితవుల్ని తెలిపేవారు, వాటి ప్రకారం ఎలా నడచుకోవాలో తెలిపేవారు. ఇలాంటి అనేక చిన్న పెద్ద గ్రంథాలు పంపబడ్డాయి. ఎన్ని గ్రంథాలన్న మాట అల్లాహ్‌కే తెలుసు. కాని నాలుగు ప్రసిద్ధ గ్రంథాలు మాత్రం మనకు తెలుసు.

1. **తౌరాత్ :** ఈ గ్రంథం మూసా (అలై)పై అవతరించబడింది. మూసా (అలై) అల్లాహ్‌కు ప్రియప్రవక్త. ఈ ప్రవక్త చరిత్ర చివరి పుటల్లో ఉంది. ఈ గ్రంథం చాలా కాలం వరకు ప్రజల జీవిత విధివిధానాలను తెలుపుతూ వచ్చింది. ప్రజలు కూడా దారి తప్పకుండా నడిచారు. కాలక్రమేణా ఈ గ్రంథానుచరులైన యూదులు అందులో చాలా మార్పులు చేర్పులు చేశారు. ఇక్కడి అక్కడి మాటలు విని అందులో జొప్పించారు. కొందరు ఈ గ్రంథం పట్ల శ్రద్ధాశక్తులు చూపలేకపోయారు. మరికొందరు అల్లరి మూకలు అధిక ప్రసంగం చేస్తూ ఈ గ్రంథాల్ని తారుమారు చేసేశారు. యూదులు చేసిన ఈ పనుల వల్ల అల్లాహ్‌కు నష్టం చేయలేకపోయారు. స్వయంగా వారే దారి తప్పారు. ఇహపరాలను చెరుచుకొన్నారు.
2. **జబూర్ గ్రంథం :** ఈ గ్రంథాన్ని హజ్రత్ దావూద్ (అలై) తెచ్చారు. యూదులు తౌరాతు గ్రంథం పట్ల ఏ విధంగా ప్రవర్తించారో అదే విధంగా ఈ గ్రంథం పట్ల కూడా వీరు ప్రవర్తించారు. ఈ గ్రంథం కూడా అసలు రూపంలో లేకుండాపోయి నమ్మశక్యం గాకుండా మారింది.
3. **ఇంజీలు (బైబిలు) :** ఈ గ్రంథం ఈసా (అలై)పై అవతరించబడింది. హజ్రత్ ఈసా (అలై) ఒక సుప్రసిద్ధ దైవప్రవక్త. వారి చరిత్ర కూడా ఈ పుస్తక చివరిపుటల్లో ఉంది. హజ్రత్ ఈసా (అలై)ను దైవం తన దగ్గరికి తీసికొన్న పిదప క్రైస్తవులు కాలక్రమేణ ఈ గ్రంథం ప్రకారం జీవితం గడుపమానేశారు. దుర్మార్గులు ఎన్నో మార్పులు చేర్పులు చేస్తూ ఈ గ్రంథాన్ని మార్చేశారు. ఈ గ్రంథం కూడా అసలు స్వరూపాన్ని పోగొట్టుకొంది.

   మహాప్రవక్త ముహమ్మద్ (స)రాకకు ముందు ఈ గ్రంథాలన్ని మారిపోయాయి. ఏ గ్రంథం కూడా నమ్మశక్యం గాకుండా ఉండిపోయింది.
4. **ఖుర్‌ఆన్ గ్రంథం :** అల్లాహ్ పంపిన చివరి గ్రంథం ఖుర్‌ఆన్. ఈ గ్రంథం మహాప్రవక్త ముహమ్మద్ (స)పై అవతరించబడింది. అరబీ భాషలో ఉంది. అసలు రూపంలో ఉన్న ఏకైక గ్రంథం ఖుర్‌ఆన్.

ఈ గ్రంథం మన వద్ద ఉంది. ఈ గ్రంథాన్ని పొల్లుపోకుండా భద్రంగా కాపాడే బాధ్యత స్వయంగా అల్లాహ్ తీసుకొన్నాడు. ప్రళయం వరకు ప్రజలకు సర్వోత్తమ మార్గం చూపే గ్రంథం ఖుర్ఆన్ ఒక్కటే. మనం సక్రమంగా ఖుర్ఆన్ గ్రంథాన్ని పఠిస్తుంటాం. అరబీ భాషలో ఈ గ్రంథాన్ని చదివి అర్థం చేసికొంటాం. ఓ అల్లాహ్! మమ్మల్ని ఖుర్ఆన్ చూపించే చక్కటి మార్గంపై నడిపించి ప్రపంచంలో గౌరవం ప్రసాదించు, పరలోకంలో కూడా మా జీవితం పుణ్యప్రదం చెయ్యి. నీ సంతోషానికి పాత్రులయ్యే విధంగా చెయ్యి ఓ ప్రభూ! (ఆమీన్)

**కొద్దిగ మన ఖుర్ఆన్ చూపించవమ్మా**
**నేను పఠిస్తాను ఖుర్ఆన్ తక్షణమే అమ్మా**
**సరిగా చదవడం నాకు నేర్పవమ్మా**
**అరబ్బీ వాక్యాల అర్థం నాకు చెప్పవమ్మా**
**చదివిన చదువులన్నీ ఒకవైపు**
**ఖుర్ఆన్ పఠనం ఒక వైపు**
**పానకంలో చక్కెరలా**
**ఖుర్ఆన్ అవగాహన కలగాలి**
**కొద్దిగ ఖుర్ఆన్ చూపించవమ్మా**
**నేను పఠిస్తాను ఖుర్ఆన్ తక్షణమేనమ్మా**

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సంక్షిప్తంగా సమాధానాలు ఇవ్వండి.**

1. అల్లాహ్ తన ప్రవక్తలను ఎందుకు పంపాడు.
2. ఖుర్ఆన్ తప్ప వేరే అల్లాహ్ గ్రంథాలు ఎందుకు నమ్మశక్యం కావు?
3. ప్రళయం వరకు వచ్చే ప్రజలకు సర్వోత్తమ మార్గం చూపే గ్రంథం ఏమిటి?
4. ఖుర్ఆన్ గ్రంథాన్ని పొల్లు పోకుండా భద్రంగా కాపాడే బాధ్యత ఎవరు తీసుకున్నారు?
5. ఖుర్ఆన్‌కు సంబంధించి ఈ పాఠంలో ఏ దుఆ నేర్పించడం జరిగింది?

**(ఆ) క్రింది వాటిని జత పరచండి.**

| | |
|---|---|
| 1. తౌరాత్ | హజ్రత్ దావూద్ అలైహిస్సలామ్ |
| 2. ఇంజీల్ | హజ్రత్ మూసా అలైహిస్సలామ్ |

| | |
|---|---|
| 3. ఖుర్ఆన్ మజీద్ | హజ్రత్ ఈసా అలైహిస్సలామ్ |
| 4. జబూర్ | హజ్రత్ ముహమ్మద్ ముస్తఫా సల్లల్లాహు అలైహి అలైహి వసల్లమ్ |
| 5. క్రైస్తవులు | హజ్రత్ మూసా అలైహిస్సలామ్ అనుయాయులు |
| 6. యూదులు | హజ్రత్ ఈసా అలైహిస్సలామ్ అనుయాయులు |

**(ఇ) ఈ క్రింది ఖాళీలను పూరించండి.**

1. అసలు రూపంలో ఉన్న ఏకైక గ్రంథం.........................................
2. అల్లాహ్ పంపిన.................................................గ్రంథం ఖుర్ఆన్.
3. మనం క్రమం తప్పకుండా ..............................గ్రంథాన్ని పఠిస్తుంటాం.
4. ఖుర్ఆన్ మజీద్.......................................................భాషలో ఉంది.
5. ఈసా (అలైహి)ని దైవం తన దగ్గరకు లేపుకున్న పిదప క్రైస్తవులు కాలక్రమేణా...................ప్రకారం జీవితం గడపమానేశారు.
6. ..........................తౌరాత్‌లో చాలా మార్పులు చేర్పులు చేశారు.

**(ఈ) ఖుర్ఆన్ మజీద్ గురించి ఐదు వాక్యాలు వ్రాయండి. ఉదాహరణకు : ఖుర్ఆన్ అల్లాహ్ అవతరింపజేసిన చివరి గ్రంథం.**

1..........................................

2..........................................

3..........................................

4..........................................

5..........................................



# 6. దైవ దూతలు

అల్లాహ్ అందరి పాలకుడు, బాదుషా. ఆయన సామ్రాజ్యం అనంతం, అనూహ్యం కూడా. సువిశాలమైన మన భూమండలం కూడా ఆయన రాజ్యంలోని అతి చిన్న భాగం మాత్రమే. విశ్వం, భూమిలోని ఏ వస్తువు అతని పరిపాలనకు బయటలేదు. మహా ప్రపంచం అనేక చిన్న పెద్ద రాజ్యాలలో చీలి ఉంది. ప్రతి రాజ్యంలోని ప్రభుత్వం వేరువేరు అతి చిన్న రాజ్యాన్ని నడుపడానికి కూడా ఎందరో ప్రభుత్వోద్యోగులు పని చేస్తున్నారు. కాని అల్లాహ్ రాజ్యం అన్నిటిని ఆవరించి ఉంది. ఆ రాజ్యం నడపడానికి ఎందురు ఉద్యోగులు పని చేస్తున్నారో ఆయనకే తెలుసు. ఈ పని చేసే వారిని దైవదూతలు అని అంటాం. ప్రభుత్వోద్యోగులు తమ బాధ్యతలు నిర్వహించడానికి కొన్ని అధికారాలు కలిగి ఉంటారు. వారు తలచుకుంటే ఇష్టానుసారంగా ప్రవర్తించగలరు కూడా. కాని అల్లాహ్ నియమించిన దైవదూతలకు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు లేవు, ఇష్టానుసారంగా ప్రవర్తించరు కూడా. ప్రభుత్వం పనులు చేయించుకో వడంలో తన ఉద్యోగుల మీద ఆధారపడక తప్పదు, కాని అల్లాహ్‌కు అలాంటి అవసరం లేదు. ఆయనకు అన్నీ తెలుసు. అన్నీ ఆయన అధీనంలోనే ఉన్నాయి. అయినప్పటికీ కొన్ని పనులు ఆయన తన దూతలతో చేయిస్తాడు.

మనం మట్టితో చేయబడ్డాము. దైవదూతలు కాంతి, తేజస్సులతో చేయబడ్డారు. దైవదూతలు మానవుల్లా లేరు. వారిలో ఆడ మగ ఉండరు, తినరు త్రాగరు. నిద్ర, కునుకు వారికి లేవు. అన్ని చోట్ల వారు వ్యాపించి వున్నారు. గాలి అగోచరంగా ఉన్నట్లే దైవదూతలు కూడా అగోచరంగానే ఉంటారు. వారికి రెక్కలు చేతులున్నాయి. కొన్నిటికి రెండు కొన్నిటికి మూడు మూడు, మరికొన్నిటికి నాలుగు నాలుగు ఉన్నాయి. దైవదూతలందరూ సద్వర్తనులు. చెడులకు, దోషాలకు అతీతంగా ఉంటారు.

దైవదూతలు అత్యంత విధేయత కలవారు. ఏ పనైనా వారికి అప్పగిస్తే ఆ పని నిర్వహణలో నిమగ్నమౌతారు. దేవుని అభీష్టానికి వ్యతిరేకంగా వారు ఏ పని కూడ చెయ్యరు. అల్లాహ్ ఆజ్ఞ ఎప్పుడు ఇవ్వబడుతుందా, అని చెవి ఒగ్గి ఉంటారు. ఆజ్ఞ ఇవ్వబడిందంటే చాలు ఆ పని వెంటనే నెరవేరుస్తారు. చేసిన పనిలో హెచ్చుతగ్గులు, లోపాలు ఏ మాత్రం ఉండవు. అల్లాహ్ ఆజ్ఞకు వ్యతిరేకంగా ఏ పని చెయ్యరు. అల్లాహ్ పనులలో వారి ప్రమేయం ఏ మాత్రం లేదు కూడా. దైవదూతలు లెక్కలేనంతమంది ఉన్నారు. వారి సంఖ్య అల్లాహ్‌కే తెలుసు. కొందరు ప్రముఖ దైవదూతల పేర్లు, వారి పనులు పేర్కొంటున్నాం.

## 1. హజ్రత్ జిబ్రాయీల్ (అలై)

దైవదూతలలో వీరు పెద్దవారు. ప్రసిద్ధి చెందిన వారు. వీరు దైవ ప్రవక్తల వద్దకు అల్లాహ్ ఆజ్ఞలను తెచ్చి ఇస్తారు. మన ప్రియప్రవక్త హజ్రత్ ముహమ్మద్ (సఅసం)కు కూడా హజ్రత్ జిబ్రాయీల్ (అలై) అల్లాహ్ సందేశం తెచ్చి ఇచ్చారు. అల్లాహ్ ఆజ్ఞ ప్రకారం కొద్దికొద్దిగా ఖుర్‌ఆన్ గ్రంథాన్ని ముహమ్మద్ (సఅసం) వరకు చేర్చారు. దైవ మార్గంలో మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం)కు ఎక్కువ దుఃఖం

కలిగినప్పుడు ఆయన్ను ఓదార్చడానికి హజ్రత్ జిబ్రాయీల్ (అలై) వచ్చేవారు. నమాజు చేసే పద్ధతి, నమాజు వేళలు, ఇంకా అనేక విషయాలు ఈ దైవదూత ద్వారా మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం)కు నేర్పడమయింది. అప్పుడప్పుడు చాలా దినముల వరకు హజ్రత్ జిబ్రాయీల్ (అలై) రానట్లయితే మహాప్రవక్త ఆందోళన చెందేవారు. వారు రాగానే మనశ్శాంతి కలిగేది.

మన ప్రియ ప్రవక్త చివరి ప్రవక్త (సఅసం). ఆయన తరువాత మరో ప్రవక్త ప్రపంచంలో రాడు. అందుచేత హజ్రత్ జిబ్రాయీల్ (అలై) పని పూర్తయింది. ఇప్పుడు హజ్రత్ జిబ్రాయీల్ (అలై) అల్లాహ్ స్తుతి, స్తోత్రంలో నిమగ్నమై ఉన్నారు.

## 2. హజ్రత్ మీకాయిల్ (అలై)

వీరు దైవదూతల్లో సుప్రసిద్ధులు. వీరి బాధ్యత అందరికి అన్న పానీయాలందించడం. అల్లాహ్ ఆజ్ఞ వల్ల ఈయన గాలుల్ని వీచేలాజేస్తున్నారు. ఇతర దైవదూతలవలె ఈయన తన విధి నిర్వహణలో దైవాజ్ఞకు కట్టుబడి ఉన్నారు. అల్లాహ్ ఆజ్ఞ లేదంటే ఈయన ఏమీ చెయ్యలేరు. గాలి వీచదు, వర్షాలు కురియవు. ఎవరికీ ఆయన ఒక ధాన్యపు గింజ కూడా ఇవ్వలేరు. ఇదంతా దైవాజ్ఞ వల్లనే జరుగుతుంది.

## 3. హజ్రత్ ఇస్రాఫీల్ (అలై)

శంఖారావం చెయ్యడం వీరి పని. ఈ ధ్వని తీవ్రంగాను, భయంకరంగాను ఉంటుంది. ప్రళయ దినాన వీరు రెండు పర్యాయాలు శంఖారావం చేస్తారు. మొదటి ధ్వనితో విశ్వం సమస్తం వినాశమవుతుంది. రెండవ శబ్దంతో సృష్టి ప్రారంభం నుంచి పుట్టినవారంతా సజీవులౌతారు. తమతమ జీవితపు లెక్కలు సమర్పించుకోవడానికి 'హషరు' మైదానంలో గుమిగూడుతారు.

## 4. హజ్రత్ ఇస్రాయీల్ (అలై)

వీరి బాధ్యత ప్రాణికోటి ప్రాణాలు తీయడం. కాని తన ఇష్టప్రకారం ఒక చీమను కూడా చంపలేరు. అల్లాహ్ ప్రతి ప్రాణి మరణం నిర్ణయించాడు. చిన్న ప్రాణి కానీయండి, పెద్ద ప్రాణి కానీయండి దాని ఆయువు పూర్తవుతూనే అల్లాహ్ ఆజ్ఞ ఇవ్వబడుతుంది. హజ్రత్ ఇస్రాయీల్ (అలై) వెంటనే ఆ ప్రాణి ప్రాణం తీస్తారు.

## మరి కొందరు ప్రసిద్ధ దైవదూతలు

ఈ నలుగురే కాక మరికొందరు సుప్రసిద్ధ దైవదూతలు కూడా ఉన్నారు.

1. **కిరామన్ కాతిబీన్ :** కిరామన్ కాతిబీన్ అంటే వ్రాసే దైవదూతలు. మనలో ప్రతి ఒక్కరి వద్ద ఇద్దరు దైవదూతల్ని ప్రభువు పెట్టాడు. మనం ఎక్కడ వెళ్ళిన, ఏ పరిస్థితుల్లో ఉన్నా ఈ ఇద్దరు దైవదూతలు మన వద్ద ఉంటారు. మన ప్రతి పని వారి సమక్షంలోనే జరుగుతుంది. మనం మాట్లాడే ప్రతి మాటను వారు వింటుంటారు. అవన్నీ వారు గ్రంథస్తం చేస్తుంటారు. మనం చేసే ప్రతి పుణ్యం, పాపం వారు నోటు చేస్తుంటారు. తీర్పుదినాన మనం చేసిన పనుల చిట్టా మన

ఎదుట ఉంటుంది. ఆ ఖాతాలో ప్రతి ఒక్కరు తమతమ జీవితంలోని మంచి చెడులను చూచుకోవచ్చు. అందుచేతనే మనం ఏకాంతంలో ఉన్న అల్లాహ్‌కు భయపడి జీవిస్తాము. ఏ పని కూడా దైవాజ్ఞకు వ్యతిరేకంగా, ఆయన సంతోషానికి విరుద్ధంగా చెయ్యము. ఏ బుద్ధిమంతుడు తన కర్మఫల జాబితాను పాడు చేసుకోదలచడు.

2. **మున్‌కిర్ నకీర్ :** వీరు ఇద్దరు దైవదూతలు. ఈ దైవ దూతలు మనిషి చనిపోయిన తరువాత ప్రతి ఒక్కరి వద్దకు వచ్చి ఆ మనిషి పాటించిన ధర్మం విషయంలో కొన్ని విషయాలు అడుగుతారు. వీరు అకస్మాత్తుగా వస్తారు. వారి రంగు రూపులు ముందునుంచి తెలియదు కాబట్టి వారిని ఈ పేరుతో పిలుస్తారు.

3. కొంతమంది దైవదూతల్ని స్వర్గం –నరకం పర్యవేక్షించేందుకు అల్లాహ్ నిర్ణయించాడు. స్వర్గద్వారపు కాపలా కాసే దైవదూత 'రిజ్వాన్', నరక ద్వారపాలడుకు 'మాలిక్'.

4. **హఫజత్ :** ఈ దైవదూతలు రక్షకులు. ప్రజలకు దుఃఖం, బాధ కలిగినప్పుడు వాటి నుంచి వీరు రక్షిస్తారు.

5. కొందరు దైవదూతలు మన నమాజుల్లో, మంచి మంచి సమావేశాల్లో వస్తుంటారు. ఈ సమావేశాల్లో పాల్గొనే వారి గురించి దైవ సమక్షంలో వీరు సాక్ష్యం పలుకుతారు.

ఇంకా అనేక రకాల దైవదూతలున్నారు. అనేక విధాలైన పనులు చెయ్య మని వారిని శాశించాడు అల్లాహ్. కాని వారికి తమంతట తాము పనిచేసే అధికారాలు లేవు. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లేవు. వారు చేసేదంతా దైవాజ్ఞల ప్రకారమే.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి.**

1. దైవ దూతలు ఎవరు?
2. దైవ దూతలు దేనితో తయారు చేయబడ్డారు?
3. మానవులు, దైవదూతల్లో ఉన్న తారతమ్యం ఏమిటి?
4. ప్రవక్త (స)కు దైవ సందేశం ఎవరు చేరవేసేవారు?

**(ఆ) క్రింద దైవదూతల పనులను బట్టి వారి పేర్లను బ్రాకెట్‌లో వ్రాయండి.**

1. ఉపాధి ఇచ్చే దూత ( )
2. ప్రాణాలు తీసే దూత ( )
3. ప్రజలను దుఃఖాల నుంచి రక్షించే దూత ( )
4. ప్రళయదినం నాడు శంఖం ఊదే దూత ( )

**(ఇ) క్రింద వాక్యాలను శ్రద్ధగా చదివి సరైన వాక్యాల ముందు ఇవ్వబడిన బ్రాకెట్‌లలో (✓) అని, తప్పు వాక్యాల ముందు ( X ) గుర్తులను వేయండి.**

1. అల్లాహ్ ఆదేశం అయిన వెంటనే ఇస్రాఫీల్ (అ) ప్రాణం తీస్తారు ( )
2. ముస్లిములమైన మనం ఒంటరిగా ఉన్నప్పుడు కూడా అల్లాహ్‌కు భయపడతాం. ( )
3. తొలి సారి శంఖం ఊదినప్పుడు చనిపోయిన వారందరూ సజీవులౌతారు. ( )
4. రెండో సారి శంఖం ఊదినప్పుడు విశ్వం సమస్తం వినాశనం అవుతుంది. ( )
5. అల్లాహ్ చేసే పనుల్లో దైవదూతల ప్రమేయం కూడా ఉంటుంది. ( )
6. అల్లాహ ప్రతి పాణి మరణం నిర్ణయించాడు. ( )
7. కొందరు దైవదూతలు మన నమాజుల్లో, మంచి కార్యాలు జరిగే సమావేశాలకు వస్తుంటారు ( )
8. దైవదూతలు మన లాగే తింటారు, త్రాగుతారు, నిద్రపోతారు. ( )

## చేయాల్సిన మరి కొన్ని పనులు

ప్రతి రోజు రాత్రి నిద్ర పోయే ముందు ఆ రోజు చేసిన మంచి పనులను, చేయకుండా వదిలిపెట్టిన మంచి పనులను గుర్తు చేసుకోవాలి.



# 7. దేవుడొక్కడే

ప్రపంచంలో ఉంటే ఇద్దరు పాలకులు
ప్రజలకు వారు అయ్యేవారు మహమ్మారులు

కాల పరిస్థితులయ్యేవి భయంకరం
జరిగేది వారిద్దరి మధ్య బీభత్సం
ఒకరంటారు ఇది నా రాజ్యం, చెల్లాలి నా మాట
మరొకరంటారు చెల్లదు నీ మాట
ఘీంకరిస్తాడు ఒక పాలకుడు
వర్షాలు కురియాలి నేడు
ఆగ్రహిస్తాడు మరో పాలకుడు
లేదు లేదు ఎండ ఉండాలి నేడు
ఒకరినొకరు కసురుకొంటారు
రేయింబవళ్ళు కయ్యాలు చేస్తారు
మారణాయుధాలు చేతబూని
రణరంగాలుగా మారుస్తారు ఈ భూమిని
సృష్టిస్తారు ఇద్దరు పాలకులు కక్షలు కార్పణ్యాలు
వ్యాపింపజేస్తారు ధరణిలోన అరాచకాలు
భూమి కంపిస్తుంది
గగనం వణుకుతుంది
మారణహోమం కల్గుతుంది
ప్రపంచం తల్లడిల్లుతుంది
భూనభోంతరాళాలు నశిస్తాయి
సూర్యచంద్రనక్షత్రాలు రాలుతాయి
అప్పుడెవరుంటారు
పాలితులుండరు
పాలకులుండరు
ఎవరూ ఉండరు
వాస్తవం, అందరి దేవుడొక్కడే
అసలు మనిషి ఈ విశ్వాసం కలవాడే

# 8. ఇస్లాం మూల సూత్రాలు

ఇస్లాం మన ధర్మం. ఇస్లాం అంటే తలవంచడం, అల్లాహ్ చెప్పింది వినడం, ఆయన ఆదేశానుసారం జీవించడం, ఇస్లాంను పాటించడం, అల్లాహ్ ఆజ్ఞలను సరిగా అమలు చేయడం. అందరి శ్రేయం ఇందులోనే ఉంది. ఇస్లాం పాటించడానికి క్రింద కనపరచిన సూత్రాలకు కట్టుబడి ఉండాలి. ఏ విధంగా ఒక భవనంలో మూల స్థంభాలు అవసరమో అదే విధంగా ఇస్లాం ధర్మానికి ఈ స్థంభాలు అత్యవసరం, ముఖ్యం కూడా. మూల స్థంభాలు లేకుంటే భవనం ఉండదు. స్థంభాలు పడిపోయాయంటే భవనం కూడా కుప్పకూలుతుంది. ఇస్లాం అనే ధర్మం ఏ ఐదు స్థంభాల మీద నిలుచుందో అవి 1) విశ్వాసం పట్ల సాక్ష్యం 2) నమాజు 3) ఉపవాసం 4) జకాతు 5) హజ్.

1. **విశ్వాసం గురించి సాక్ష్యం పలుకడం :** "అల్లాహ్ తప్ప ఇతర ఆరాధ్యదైవం లేదు. హజ్రత్ ముహమ్మద్ (సఅసం) అల్లాహ్ దాసుడు, ఆయన ప్రవక్త" అని హృదయపూర్వకంగా అంగీకరించి ఆ వాక్యాన్ని పలుకాలి.

اَشْهَدُ اَنْ لَّآ اِلٰهَ اِلَّا اللّٰهُ وَاَشْهَدُ اَنَّ مُحَمَّدًا عَبْدُهٗ وَ رَسُوْلُهٗ

**అష్హదుఅన్ లా ఇలాహ ఇల్లల్లాహు వ అష్హదుఅన్న ముహమ్మదన్ అబ్దుహూ వ రసూలుహూ**

దీనినే 'కలిమా' పట్ల సాక్ష్యమివ్వడం అని కూడా అంటారు. ఈ విశ్వాసం మనసార ప్రకటించకపోతే అల్లాహ్ ఆజ్ఞలను ఎలా ఆలకించి పాలించగలం? మహాప్రవక్త ముహమ్మద్(సఅసం) తెచ్చిన చక్కటి మార్గం మనము స్వచ్ఛందంగా అంగీకరించగలమా? విశ్వాసరాహిత్యం అల్లాహ్ పట్ల విధేయునిగా ఎలా చేయగలుగుతుంది?

2. **నమాజు :** నమాజు వేళకు సరిగా చెయ్యాలి. నమాజు ఒక్కటే ప్రతిదినం ఐదుసార్లు మనం అల్లాహ్‌కు దాసులమని గుర్తుచేస్తుంది. ఆయన ఆజ్ఞల ప్రకారం నడుచుకోవాలని తెలియజేస్తుంది. మరుపు వల్ల, ఇంకే కారణం వల్లగాని నమాజును వదిలినట్లయితే వెంటనే క్షమాపణ వేడుకోవాలి. ముమ్ముందు జాగ్రత్త పడాలి. నమాజు సక్రమంగా చేయని వ్యక్తి అల్లాహ్‌ను ఆయన ఆజ్ఞల్ని ఎలా జ్ఞాపకం ఉంచుకోగలడు. అలాంటి వ్యక్తి ప్రపంచంలో కూడా మార్గభ్రష్టుడవుతాడు, పరలోకంలో కూడా పరాభవం పాలవుతాడు. అందుచేతనే నమాజు చెయ్యమని మనకు నొక్కి చెప్పబడింది. మరణానంతరం ప్రథమంగా నమాజు విషయంలో అల్లాహ్ ప్రశ్నిస్తాడు. నమాజులు చేయనివానికి కఠిన శిక్ష ఇస్తాడు.

3. **ఉపవాసం :** రమజాను నెలలో ఉపవాసం ఉండాలి. రమజాను నెల వచ్చిందంటే మనం ఒక నెల రోజులు ఉపవాస వ్రతం పాటిస్తాం. అల్లాహ్ ఆజ్ఞ ప్రకారం పగలంతా తినడం, త్రాగడం మానేస్తాం. ఇస్లామీయ జీవితం పాటించే వారు ఆకలిదప్పులు ఎదుర్కోవలసి వస్తుంది. పస్తు కూడా ఉండ వలసి వస్తుంది. హలాల్ వస్తువులు ఒక్కోమారు దొరకవు. ఉపవాస వ్రతాన్ని పాటించే అలవాటు

ఉన్నట్లయితే, అట్టి గడ్డు సమయాల్లో కూడా మనం అల్లాహ్ ఆజ్ఞల్ని ఆలకించి పాటిస్తాం. ఆకలిదప్పుల బాధను లెక్కచెయ్యం.

4. **జకాతు :** జకాతు అంటే తమ వార్షిక ఆదాయంలో నిర్ణీత సొమ్ము తీయాలి, దైవమార్గంలో వెచ్చించాలి. ఐశ్వర్యం, డబ్బు పట్ల ప్రేమ మానవుణ్ణి చక్కటి మార్గం నుండి తొలగిస్తుంది. జకాతు మన హృదయాల నుండి ధన వ్యామోహాన్ని తొలగించి, అల్లాహ్ పట్ల ప్రేమను పెంచుతుంది, సొమ్ము విషవలయంలో పడి దైవాన్ని దైవాజ్ఞలను విస్మరించే ప్రమాదం నుండి జకాతు మనల్ని కాపాడు తుంది.

5. **హజ్ :** జీవితంలో ఒక మారు కనీసం 'కాబా' హజ్ చేయాలి. అల్లాహ్ పట్ల ఉన్న విధేయత ప్రపంచ ప్రజలందరూ సామూహికంగా వ్యక్తపరచాలి. అలా లేకపోతే కొంతమంది అల్లాహ్ ఆజ్ఞల్ని అనుసరిస్తారు మరికొందరు అందులో ఆటంకాలు సృష్టిస్తారు. అందుచేతనే అల్లాహ్ మక్కాలో ఉన్న తన గృహాన్ని పావనం చేశాడు, ప్రపంచవాసులందరు సంవత్సరానికొక పర్యాయం అక్కడ సమావేశం కావాలి. అందరు కలసి మెలసి ప్రపంచంలో అల్లాహ్ ఆజ్ఞల ప్రకారం నడచుకోవాలి, అందరి జీవితాలను ఆ ఆజ్ఞల ప్రకారం మలచుకోవాలి కూడా.

అల్లాహ్ ఇచ్చిన ఆజ్ఞల ప్రకారం నడచుకోవడానికి ఈ ఐదు విషయాలు అతి ముఖ్యం. అందుచేతనే ఈ ఐదింటికి సత్యధర్మ స్థంబాలని (అర్కాన్) అంటాం. అరబ్బీ భాషలో 'రుకున్' అంటే స్థంభం అని అర్థం. ఈ ఐదు మూల స్థంభాలపైనే ఇస్లాం అనే భవనం నిలబడి ఉంది.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సంక్షిప్తంగా సమాధానాలు వ్రాయండి.**

1. ఇస్లామ్ ధర్మం ఎన్ని స్థంభాలపై నిలబడి ఉంది? అవి ఏవి?
2. కలిమయే షహాదత్ అంటే ఏమిటి?
3. నమాజ్ మనకు ఏం గుర్తు చేస్తుంది?
4. సంవత్సరంలోఎన్ని ఉపవాసాలు విధిగా పాటించాలి?
5. మనం జకాత్ ఎందుకు చెల్లిస్తాం?
6. మరణించిన తరువాత అందరికంటే ముందు ఏ విషయం గురించి ప్రశ్నించడం జరుగుతుంది?

**(ఆ) ఈ క్రింది వాక్యాలను శ్రద్ధగా చదివి సరైన వాక్యాల ముందు (✓) తప్పు వాక్యాల ముందు (X) గుర్తులను వేయండి.**

1. ఈమాన్ లేకపోతే మనిషి అల్లాహ్ విధేయుడు కాలేడు ( )
2. ప్రతిరోజు ఐదు పూటలా చేసే ఖుర్ఆన్ పారాయణమే మనం అల్లాహ్ దాసులమని, ఆయన బానిసలమని తెలియజేస్తుంది. ( )
3. మరణించిన తరువాత అల్లాహ్ అన్నిటికంటే ముందు ఉపవాసాల గురించి ప్రశ్నిస్తాడు. ( )

4. తప్పనిసరిగా నమాజ్ చేసే వారు ప్రతి విషయంలో అల్లాహ్ ఆయన ఆదేశాలను పాటిస్తారు. ( )

5. డబ్బు, ధన వ్యామోహం అనేక మందిని చెడు మార్గం వైపు తీసుకుని వెళ్తుంది. ( )

6. మనం ప్రతి సంవత్సరం రమాజన్ మాసంలో తప్పనిసరిగా రెండు నెలల పాటు అల్లాహ్ ఆదేశంతో అన్నపానీయాలను వదిలిపెడతాము. ( )

7. జీవితంలో కనీసం మూడు సార్లు హజ్ చేయాలి. ( )

**(ఇ) వరుస క్రమంలో ఈ క్రింది వాటిని జత పరచండి.**

| | |
|---|---|
| 1. మొదటి అంశం | జకాత్ |
| 2. రెండో అంశం | హజ్ |
| 3. మూడో అంశం | విశ్వాసం గురించి సాక్ష్యం |
| 4. నాలుగో అంశం | నమాజ్ |
| 5. ఐదో అంశం | ఉపవాసం |

**(ఈ) క్రింద ఇచ్చిన పదాల ద్వారా ఖాళీలను పూరించండి.**

జకాత్, శిక్షిస్తాడు, ఇస్లామ్, స్థంభాలు, ఆరాధ్యుడు

1. ..................ధర్మాన్ని అవలంభించడంలోనే అందరి మేలుంది.
2. అల్లాహ్ తప్ప మరో ..............................లేడు
3. నమాజ్ చేయని వారిని అల్లాహ్ కఠినంగా.............................
4. ..........................మన హృదయాల్లోని ధనవ్యామోహాన్ని తీసి వేసి అల్లాహ్ ప్రేమను నింపుతుంది.
5. ఈ ఐదింటిని సత్యధర్మ...............................అంటారు.

## చేయాల్సిన మరి కొన్ని పనులు

కలిమయే షహాదత్ మరియు దాని అర్థాన్ని కంఠస్తం చేయండి. మీ మిత్రులకూ కంఠస్తం వినిపించండి.



# 9. నమాజు

నమాజు సత్య ధర్మపు మూలస్థంభం. ఎవరైతే నమాజును ఖాయం చేస్తారో (సక్రమంగా చేస్తూ వస్తారో) ఆ వ్యక్తి ఇస్లాం ధర్మాన్ని స్థాపితం చేస్తాడు. ఎవరైతే నమాజును వదిలేస్తాడో అతడు పూర్తి సత్యధర్మాన్ని పడగొట్టాడు అన్న మాటే.

నమాజు మనల్ని దైవ శాసనం పాటించే వారిగా చేస్తుంది. ఎవరు నమాజు చేయరో వారు అల్లాహ్ ఆజ్ఞల్ని పాలించే వారు కారు. ముస్లిములలో, ముస్లిమేతరులలో వ్యత్యాసం నమాజే.

తీర్పు దినాన అన్నిటికంటే ముందు దైవం నమాజు విషయంలో ప్రశ్నిస్తాడు. అతని నమాజులు అంగీకరించబడ్డాయంటే అతడు చేసిన పుణ్య కార్యాల ప్రతిఫలమంత లభిస్తుంది, లేకుంటే చేసిన మంచి పనులన్నీ రద్దు చేయబడతాయి.

నమాజు స్వర్గ ప్రవేశానికి తాళం చెవి లాంటిది. నమాజు అంటే మహాప్రవక్త (స)కు కంటి చలువ. నమాజు ముస్లిములకు మేరాజ్ లాంటిది. 'మేరాజ్' దినాన అల్లాహ్ మహాప్రవక్తను తన వద్దకు పిలిపించాడు. నమాజుల్లో మనం అల్లాహ్ ఎదుట నిలబడతాం, అల్లాహ్‌తో సంబోధిస్తాం కూడ.

నమాజు మనల్ని చెడుకు దూరంగా చేస్తుంది. లజ్జా విహీనత నుండి కాపాడుతుంది. ఇది మనల్ని సత్ప్రవర్తన కలవారిగా చేస్తుంది. తెలియక చేసిన తప్పులకు క్షమాభిక్ష ప్రసాదింపజేస్తుంది. దీని నాశ్రయించే మనం ఇహపరాల పుణ్యఫలాలను ప్రోగుచేసికొంటాం.

### నమాజు చెయ్యమని నొక్కి చెప్పడం

నమాజుకు అసాధారణ ప్రాధాన్యం ఉంది. అందుచేతనే దీనికి ఎంతో ప్రాముఖ్యత ఇవ్వబడింది, దివ్యఖుర్ఆన్‌లో నమాజు విషయం ఏడువందలసార్లకు పైగా పేర్కొనబడింది. దీనివల్ల నమాజ్ అంటే అల్లాహ్‌కు ఎంత ప్రియమో విదితమవుతుంది. మహాప్రవక్త ముహమ్మద్ (స) కూడా నమాజును గురించి నొక్కి చెప్పారు. నమాజు దైవ ధర్మపు మూలస్థంభమని, కంటి చలువ అని, విశ్వాసి తేజస్సు అని తెలిపారు మన ప్రియప్రవక్త (స). ఇది ఇస్లాం గుర్తు అని, ఉత్తమ జిహాద్ (ధర్మయుద్ధం) అని తెలిపారు.

నమాజు వదిలిన వారికి కఠిన శిక్ష ఉంది. నమాజు చేయని వారి ఇహపరాలు రెండూ నాశన మవుతాయి. మన ప్రియప్రవక్త అన్నారు : 'అజాన్' పిలుపు విన్న తరువాత ఎవరైతే తమ ఇండ్ల నుండి (నమాజుకు) వెళ్ళరో వారి ఇండ్లకు నిప్పంటించాలనే తలంపు నాకు కలుగుతుంది".

మహాప్రవక్త అన్నారు : "పిల్లవాండ్లు ఏడేండ్ల ప్రాయానికి వస్తే వారిని నమాజు చెయ్యమని నొక్కి చెప్పండి. పదేండ్ల వయస్సు వచ్చాక నమాజు చెయ్యకపోతే వారిని కొట్టండి". మహాప్రవక్త ప్రపంచానికి కారుణ్యమూర్తిగా వచ్చారు. ఆయన పిల్లవాండ్లను ఎప్పుడు దండించలేదు. పిల్లవారంటే ఆయనకు ఎనలేని ప్రేమ. అలాంటి ఆదర్శమూర్తి (సఅసం) నమాజు విషయంలో శిక్షించాలని సెలవిచ్చారు. అలాంటప్పుడు నమాజుకు ఎంత ప్రాముఖ్యత వుందో గ్రహించండి.

**నమాజు వేళలు, అందులోని 'రకాతులు':**

రేయింబవళ్ల సమయంలో మొత్తం ఐదుపూటలు నమాజు తప్పనిసరిగా చేయాలి. దీనినే 'ఫరజ్' నమాజులంటారు.

1. **ఫజర్ :** ప్రాతఃకాలం నుండి సూర్యోదయానికంటే కొంత ముందు 'ఫజర్' నమాజు సమయం. సూర్యుని ఏ కొద్ది భాగం కూడా కనబడినా ఫజర్ నమాజు సమయం అంతమవుతుంది. ఒకవేళ అలా జరిగితే పూర్తి సూర్యోదయం తరువాత 'ఫజర్' నమాజు ఖజా (సమయం అయ్యాక) చేయవలసి ఉంటుంది.

   ఫజర్ నమాజు నాలుగు రకాతుల నమాజులు. మొదటి రెండు రకాతులు సున్నత్ నమాజు, తరువాత రెండు రకాతులు ఫరజ్. సున్నత్ నమాజులు కూడా ఫరజ్ మాదిరిగానే చేయాలి. కాని ఫరజ్ నమాజులు ఇమాం వెనుక సామూహికంగా చేస్తాము. నమాజుకు ముందు తక్బీర్ చెప్పబడుతుంది. తరువాత ఇమాం సాహెబ్ సూరయె ఫాతిహా పఠిస్తారు. ఆ తరువాత మరొక సూరా పఠిస్తారు. సున్నతు నమాజు మాత్రం ప్రతి ఒక్కరు వేర్వేరుగా చేయాలి. బిగ్గరగా కాకుండా నెమ్మదిగా చదువుకోవాలి.

2. **జుహర్ నమాజు :** సూర్యుడు మిట్ట మధ్యాహ్నం దాటాక జుహర్ నమాజు సమయం ప్రారంభమవుతుంది. అసర్ నమాజు సమయం వచ్చేంత వరకు జుహర్ సమయం ఉంటుంది. అసర్ నమాజు సమయం ప్రారంభం కాకమునుపే జుహర్ నమాజు చేసుకోవడం ఉత్తమం. జుహర్ నమాజులో పది రకాతులు నమాజులు చేయబడతాయి. మొదటి నాలుగు రకాతుల సున్నత్ నమాజు, తరువాత నాలుగు రకాతుల ఫరజ్ నమాజు, ఆ తరువాత రెండు రకాతులు సున్నత్ నమాజు. నాలుగు రకాతుల సున్నత్, నాలుగు రకాతుల ఫరజ్ నమాజులలోని వ్యత్యాసం, ఫరజ్ చివరి రెండు రకాతుల నమాజులో కేవలం సూరయె ఫాతిహా చదువబడుతుంది, సున్నత్ నమాజులో చివరి రెండు రకాతులలో సూరయె ఫాతిహాతోపాటు మరో సూరా కూడా నెమ్మదిగానే చదువబడుతుంది.

3. **అసర్ నమాజు :** ఇంకా ఒకటిన్నర, రెండు గంటల ప్రొద్దు ఉన్నప్పుడు అసర్ సమయం ప్రారంభమై ప్రొద్దుగ్రుంకేంత వరకు అసర్ నమాజు సమయం ఉంటుంది. కాని సూర్యుడు ఇంకా పసుపు పచ్చ పడక ముందే అసర్ నమాజు చేయటం ఉత్తమం. లేకుంటే నమాజు మక్రూహ్‌గా మారుతుంది. అసర్ నమాజులో నాలుగు రకాతులు ఫరజ్ నమాజు ఉంటుంది. ఇది కూడా జుహర్ నమాజు మాదిరిగా నెమ్మదిగా చదువుకోవాలి.

4. **మగ్‌రిబ్ నమాజు :** మగ్‌రిబ్ నమాజు సమయం సూర్యాస్తమయం నుండి పశ్చిమ దిశలో ఆకాశంలోని రంగు తెల్లని వెలుతురు ముగిసేంత వరకు వుంటుంది. సూర్యుడు అస్తమించగానే మగ్‌రిబ్ నమాజు తొందరగా చేసుకోవడం మంచిది. లేకుంటే నమాజు మక్రూహ్‌గా మారుతుంది. మగ్‌రిబ్ నమాజులో ఐదు రకాతులు ఉంటాయి. మొదటి మూడు రకాతులు ఫరజ్ నమాజు మళ్లీ రెండు రకాతులు సున్నత్ నమాజు.

5. **ఇషా నమాజు:** ఇషా నమాజు సమయం మగ్‌రిబ్ నమాజు సమయం ముగిసినప్పటి నుండి ఉదయం ఉషోదయానికి ముందు వరకు వుంటుంది. కాని అర్ధరాత్రి గడువక ముందు ఇషా నమాజు చేసుకోవడం ఉత్తమం లేకుంటే నమాజు మక్రూహ్ అవుతుంది.

ఇషా నమాజులో తొమ్మిది రకాతులున్నాయి. మొదటి నాలుగు రకాతలు ఫరజ్ నమాజు తరువాత రెండు రకాతులు సున్నత్ ఆ తరువాత మూడు రకాతులు వితర్ నమాజులు. వితర్ నమాజులో రెండు రకాతుల నమాజు తరువాత కూర్చుండి "అత్తహయ్యాత్" చదివిన తరువాత లేచి నిలబడి సూరయె ఫాతిహ, వేరొక సూరాను పఠించి, అల్లాహు అక్బర్' అంటూ చేతులు ఎత్తి, పిమ్మట చేతులు కట్టుకొని దువా-యె-ఖునూత్ చదివి, అల్లాహు అక్బర్ అంటూ రుకూలో వెళ్తాం, నమాజు పూర్తి చేస్తాం.

**జుమా నమాజు :** జుమా నమాజు ప్రతి శుక్రవారం 'జుహర్' నమాజు సమయంలో చేస్తారు. స్నానం చేసి, ఉతికిన బట్టలు వేసికొని, నమాజుకు ముందే జామియా మసీదు చేరుకొంటాం. జుమ నమాజు ఎప్పుడు జామియా మసీదులోనే చేస్తాం. మొదట నాలుగు రకాతులు సున్నత్ నమాజు చేస్తాం. ఇమాం సాహెబు మెంబరు మీద కూర్చునేసరికి, ముఅజ్జను రెండవ అజాన్ పలుకుతాడు. అజాన్ తరువాత ఇమాం సాహెబ్ 'ఖుతుబ' (ఉపన్యాసం) ఇస్తారు. ఖుతబ తరువాత రెండు రకాతులు ఫరజ్ నమాజు చేయిస్తారు. ఈ రెండు రకాతులు అందరూ సామూహికంగా చేస్తారు. ఫరజ్ నమాజు తరువాత కొందరు నాలుగు రకాతులు మరికొందరు రెండు రకాతులు సున్నత్ నమాజులు చేస్తారు. శుక్రవారం జుహర్ నమాజుకు బదులు జుమా నమాజు ఉంటుంది. అందుచేత శుక్రవారం జుహర్ నమాజు చేయడం ఉండదు. (జుహర్, జుమా, మగ్‌రిబ్, ఇషా నమాజుల చివర రెండు రకాతులు నఫిల్ నమాజులు కూడా చేస్తారు).

### ఏ ఏ సమయాల్లో నమాజు చేయడం నిషేధించబడింది:

సూర్యుడు ఉదయించే లేదా అస్తమించే సమయంలో, సూర్యుడు నడినెత్తి మీద ఉన్న సమయంలో నమాజు చేయరాదు. ఇదే విధంగా ఫజర్ నమాజులో రెండు రకాతులు సున్నత్ చదివాక నఫిల్ నమాజు చెయ్యరాదు. అసర్ మరియు మగ్‌రిబ్ నమాజుల మధ్య కూడా నఫిల్ నమాజు చేయరాదు.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి.**

1. ముస్లిమ్, కాఫిర్‌లో ఉన్న బేధం ఏమిటి?

2. నమాజ్ చేయడం వల్ల కలిగే ప్రయోజనాలు ఏమిటి?

3. విత్ర్ నమాజ్ చేసే విధానం తెలుపండి?

4. ఏ ఏ సమయాలలో నమాజ్ చేయడం నిషిద్ధం?
5. జుముఆ నమాజ్‌లో మనం మొత్తం ఎన్ని రకాతుల ఫర్జ్ నమాజ్, సున్నత్ నమాజ్‌లు చేస్తాం?
6. జుమా నమాజ్ చేసే విధానాన్ని తెలపండి.

**(ఆ) ఈ క్రింది హదీసుల ద్వారా మనకు బోధ పడే విషయం ఏమిటి?**

1. అజాన్ పిలుపు విన్న తరువాత ఎవరైతే తమ ఇండ్ల నుంచి నమాజ్‌కు వెళ్ళరో వారి ఇండ్లకు నిప్పంటించాలనే తలంపు నాకు కలుగుతుంది.
2. పిల్లవాండ్లు ఏడేండ్ల ప్రాయానికి వస్తే వారిని నమాజ్ చెయ్యమని నొక్కి చెప్పండి. పదేండ్ల వయస్సు వచ్చాక నమాజ్ చెయ్యకపోతే వారిని కొట్టండి.

**(ఇ) ఈ క్రింద ఇచ్చిన పటంలో నమాజ్‌ల ప్రారంభ, ముగింపు వేళలతో పాటు వాటిని ఎప్పుడు చదవడం అభిలషణీయమో కూడా తెలపండి.**

| నమాజు పేరు | నమాజు వేళలు | | ఎప్పుడు చదవడం అభిలషణీయం |
|---|---|---|---|
| | ప్రారంభం | ముగింపు | |
| జుహ్ర్ | | | |
| మగ్‌రిబ్ | | | |
| ఫజర్ | | | |
| అస్ర్ | | | |
| ఇషా | | | |
| జుముఅ | | | |

(ఈ) క్రింద ఇచ్చిన నమాజులలో ఏ నమాజ్‌లో ఎన్ని ఫర్జ్ ఎన్ని సున్నత్, విత్ర్ నమాజులు చదువుతామో వాటి రకాతుల సంఖ్యను వ్రాయండి.

| నమాజు పేరు | ఫర్జ్ | ఫర్జ్‌కు ముందు | ఫర్జ్‌కు తరువాత | వితర్ |
|---|---|---|---|---|
| జుహ్ర్ | | | | |
| ఫజర్ | | | | |
| ఇషా | | | | |
| అస్ర్ | | | | |
| మగ్‌రిబ్ | | | | |
| జుముఅ | | | | |



# 10. నమాజు నిబంధనలు

ప్రతి పని ప్రారంభించడానికి కొన్ని విషయాలు దృష్టిలో పెట్టుకోవలసి ఉంటుంది. చదవడం, వ్రాయడమే తీసుకోండి. ఇవి నేర్చుకోడానికి పలక, పుస్తకం కావాలి, కలము, సిరా తీసుకోవాలి. విద్యా బోధనకు గురువు కావాలి. కూర్చోడానికి ఒక స్థలం అంటూ ఉండాలి. అంత వరకు చదవడం, వ్రాయడం ప్రారంభం చేయలేము. అందులో ఏది లోపించినప్పటికీ, చదవడం, వ్రాయడం నేర్చుకోవడానికి తలపడితే, ఆ పని సరిగా నెరవేరదు. ఇదే విధంగా నమాజు విధానం ఉంది. నమాజు నిర్విఘ్నంగా చేయాలంటే దానికి కొన్ని షరతులున్నాయి. ఈ షరతులు పూర్తి చేయకుండా నమాజు ప్రారంభించం. నియమోల్లంఘనతో నమాజు చక్కగా చేయలేము.

**నమాజు కోసం షరతులు**

1. దేహం పరిశుద్ధంగా ఉండాలి. అందులో ఉజూ కూడా ఉంది.
2. ధరించిన బట్టలు పరిశుభ్రంగా ఉండాలి.
3. నమాజు చేసే స్థలం కూడా శుభ్రంగా ఉండాలి.
4. సతర్ (కనీస ఆచ్ఛాదనా శరీర భాగం) కప్పుకోవాలి.
5. వేళకు సరిగా నమాజులు చేయాలి.
6. ఖిబ్లా (కాబా) వైపునకు ముఖం చేయాలి.
7. నమాజు కోసం సంకల్పం చేయాలి.

**నమాజు చేయడానికి ముందు మనం ఈ షరతుల్ని పూర్తి చేసుకొంటాం.**

1. దేహాంగాలపై ఏదైనా మలినం ఉన్నట్లయితే దానిని శుభ్రపరచుకొంటాం. మలమూత్ర విసర్జన స్థలాలను పద్ధతి ప్రకారం పరిశుద్ధం చేసుకొంటాం. పూర్తి శరీరాన్ని శుభ్రపరచుకోవాలంటే స్నానం చేస్తాం. ఉజూ చేయవలసిన అవసరం ఉంటే ఉజూ దాని విధానం ప్రకారం చేసుకొంటాం. ఉజూ చేయకుండా పూర్తి నమాజు చేసినప్పటికీ అది నమాజు కాజాలదు. అంతెందుకు ఎంతో పరిశుభ్రతతో ఉజూ చేసి అల్లాహ్ సమక్షంలో చేరి నమాజులు చేస్తాం. అపరిశుభ్రత, మలినం అంటే మనకెంతో అసహ్యం. చేతులార మన నమాజులను మనము చెడుపుకోము కూడ.
2. మన దుస్తులు పరిశుభ్రంగా లేకపోయినట్లయితే నమాజుకు ముందు బట్టలను ఉత్తుక్కొని తొడుక్కుం టాము. మల మూత్రాలు తగిలిన, మురికి నీళ్ళు లేదా బురద తగిలినట్లయితే మంచినీళ్ళతో మూడేసి సార్లు బాగుగా కడిగి తుడుచుకొంటాం, బట్టలయితే పిండుతాం. ఒకవేళ బట్టలకు మురికి ఎక్కువగా తగిలి ఉండి కడుక్కోడానికి తీరిక లేనట్లయితే బట్టలు మార్చేస్తాం. అపరిశుభ్ర బట్టలతో మనము అల్లాహ్ ఎదుట వెళ్ళం. అలాంటి దుస్తులు వేసుకొంటే నమాజు పూర్తికాదు కూడా.

3. నమాజు చాప మీద చేసిన ముసల్లాహ్ మీద లేదా నేలపై చేసినా అది శుభ్రంగా చేసి ఉండాలి. అపరిశుద్ధ ప్రదేశంలో నమాజు కోసం నిలబడం. దేహం, దుస్తులతో పాటు నమాజు స్థలం కూడా పరిశుభ్రంగా ఉంటేనే నమాజు సక్రమంగా నిర్వహించబడుతుంది.

4. దుస్తుల్ని కూడా పూర్తిగా వేసుకొని నమాజు చేస్తాం. అల్లాహ్ దర్బారులో సక్రమంగా దుస్తులు వేసికోకుండా వెళ్ళం. తలపై టోపి, భుజాల నుండి మోచేతుల వరకు కప్పివున్న చేతుల షర్టు లేదా చొక్కా, లుంగీ లేదా పైజామ తొడుక్కొంటాం. మోకాళ్ళు ఇతర ఆచ్ఛాదనా భాగాలు బాగుగ కప్పుకొంటాం. ఏ కారణం చేతనైనా పూర్తి దుస్తులు లేనప్పుడు బొడ్డు నుండి మోకాళ్ళ వరకు కప్పుకొనే గుడ్డ తప్పకుండా ఉండాలి. అంతకు తక్కువ దుస్తులు వేసుకొంటే పురుషుల నమాజు కానేకాదు. అమ్మ, అక్కచెల్లెళ్ళు నమాజు చేసే సమయంలో దుప్పటితో ముఖం, అరచేతులు, మడిమల నుండి పాదాలు తప్ప మరే దేహ భాగం కనబడకుండా కప్పుకొంటారు. ఇవి తప్ప మరే దేహభాగం కనబడినా వారి నమాజు పూర్తికాదు.

5. నమాజులు చేసే సమయం అల్లాహ్ నిర్ణయించాడు. ప్రతి నమాజు నిర్ణీత సమయాల్లోనే చేస్తాం. నమాజు చేయతలపెట్టాక, ఆ నమాజు సమయం పట్ల సంతృప్తి చెందాకే నమాజు ప్రారంభిస్తాం. మిట్ట మధ్యాహ్నం దాటకముందే జుహర్ నమాజు చెయ్యం. వేరే నమాజులు కూడా తొందరపడి వేళకు ముందే చెయ్యము. వేళకు సరిగ్గా నమాజు చేస్తాము. సమయం దాటక ముందే నమాజు ముగించుకొంటాం. ఏ నమాజు కూడా వేళకు ముందు లేదా సమయం దాటాక చెయ్యం. అందుచేత సమయానికి ప్రత్యేక శ్రద్ధ తీసుకొని నమాజులు చేస్తాం. తొందరపడడం కాని, అశ్రద్ధతో సమయాన్ని వెళ్ళబుచ్చడంగాని ఉండదు.

6. 'కాబా' ఉన్న వైపు ఖిబ్లా అనబడుతుంది. ఎప్పుడూ ఖిబ్లా వైపు ముఖం చేసి నమాజు చేస్తాం. మసీదులన్నీ ఖిబ్లా వైపుపెట్టి నిర్మిస్తారు. అందుచేత ఖిబ్లా ఏ వైపు ఉన్నది తెలుసుకోవడం సులభం. కాని ప్రయాణం చేసే సమయంలో ఖిబ్లా ఎటువైపువుందో తేల్చుకోవడం సులభం కాదు. ఎలాంటి సంకోచం లేకుండా స్థానికులను అడిగి ఖిబ్లా ఎటువుందో తెలుసుకొంటాం. తెలిసి కూడా ఖిబ్లా వైపు కాకుండా మరోవైపు ముఖం చేసి నమాజు చేస్తే అది నమాజు కాదు. అందుచేత ఖిబ్లా ఎటు వుందో తెలుసుకొని నమాజు చేయాలి.

7. ఏ నమాజు అయినా సరే, అందులో ఎన్నెన్ని రకాతులు నమాజు చేయాలో మనసులో ఆలోచించి, నోటితో ప్రస్తావించి నమాజు చేస్తాం. దృష్టాంతానికి 'అసరు'లో నాలుగు రకాతులు ఫరజ్ నమాజు ఇమాం వెనుక చేస్తున్నాం అనుకోండి, అప్పుడు నోటితో కూడా ఆ నమాజు చేస్తున్నామని అంటాం, కనీసం మనసులోనైనా ఆ నమాజు చేస్తున్నామని సంకల్పించి నమాజు చేస్తాం. లేకుంటే నమాజు పూర్తి కాదు. "నాలుగు రకాతులు ఫరజ్ నమాజు 'అసర్' ఈ ఇమాం సాహెబ్ వెనుక, ముఖం ఖిబ్లావైపు" అని చెబుతూ నమాజు ప్రారంభిస్తాం. ఇదే విధంగా ఐదు పూటల నమాజులు చేస్తాం, పై ఏడు షరతులు పాటిస్తాం. ఈ షరతులు పూర్తి చేయకుండా నమాజు కాదు.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వండి**

1. నమాజ్‌లోని షరతులను వరుస క్రమంలో వ్రాయండి?
2. పూర్తి శరీరాన్ని శుభ్రపరచుకోవాలంటే ఏం చేయాలి?
3. మలమూత్రాలు, మురికి నీళ్లు లేదా బురద తగిలినట్లయితే ఏం చేయాలి?
4. అల్లాహ్ దర్బారులో మనం ఎలా వెళ్లాలి?
5. ఏ కారణం చేతనయినా పూర్తి దుస్తులు లేక పోతే కనీసం ఏ ఏ భాగాలు కప్పి ఉంచాలి?
6. నమాజ్‌లో స్త్రీలు ఏ ఏ దేహ భాగాలను కప్పి ఉంచాలి?
7. నమాజ్ కోసం సంకల్పం చేయాలి అంటే భావం ఏమిటి?

**(ఆ) ఈ క్రింద ఇచ్చిన విషయాలను శ్రద్ధగా చదవండి. వాటిలో సరైన వాక్యాల ముందు (✓) గుర్తు, తప్పు వాక్యాల ముందు (X ) గుర్తులు వేయండి.**

1. నమాజ్ ప్రారంభించే ముందు పది నిబంధనలను తప్పనిసరిగా పాటించాలి? ( )
2. వుజూ లేక పోయినా నమాజ్ అవుతుంది? ( )
3. మనం పరిశుభ్రంగా వుజూ చేసుకుని అల్లాహ్ దర్బారులో హాజరవుతాము ( )
4. అపరిశుభ్రత, మలినం అంటే మనకు అసహ్యం ( )
5. పరిశుభ్రత ఎక్కువ తగిలి కడిగే అవకాశం లేకున్నప్పుడు అవే దుస్తుల్లో నమాజ్ చేయవచ్చు ( )
6. మనం ఖిబ్లా వైపు తిరిగి నమాజ్ చేస్తాం ( )
7. సమయానికి ముందు కానీ తరువాత కానీ నమాజ్ చేస్తే అవదు ( )

**(ఇ) ఈ క్రింది ఖాళీలను పూరించండి.**

1. నమాజ్‌లు చేసే సమయం........................నిర్ణయించాడు.
2. ......................బట్టలతో మనం అల్లాహ్ ఎదుట వెళ్లము.
3. దేహాంగాలపై ఏదైనా మలినం ఉన్నట్లుయితే దానిని.......................................
4. ఎప్పుడూ..............................వైపు ముఖం చేసి నమాజ్ చేస్తాం.
5. ఏ నమాజ్ అయినా సరే.....................లో ఆలోచించి నమాజ్ చేస్తాం.

## చేయాల్సిన మరి కొన్ని పనులు

ప్రయాణంలో ఉన్నప్పుడు ఖిబ్లా దశను ఎలా తెలుసుకోవాలో మీ ఉపాధ్యాయుడిని అడిగి తెలుసుకోండి.



# 11. నమాజు అర్కాన్ (స్థంభాలు)

నమాజులో ఏడు విషయాల్ని తప్పకుండా పాటించాలి. అందులో ఏది లోపించిన నమాజు కాజాలదు. ఒక భవనం ఏడు స్థంభాలపై ఆధారపడితే ఆ భవనంలో స్థంభాల ప్రాముఖ్యత ఎంత ఉంటుందో అంతే నమాజు విషయం కూడా. అందుచేతనే ఈ ఏడు విషయాలను నమాజు అర్కాన్ అనీ, స్థంభాలనీ అంటాం. ఆ ఏడు విషయాలు :

1. అల్లాహు అక్బర్ అనడం (తక్బీర్-యె-తహ్రీమ)
2. నిలబడడం (ఖియాం)
3. ఖుర్ఆన్‌లో కొద్ది భాగం పఠించడం (ఖిర్అత్)
4. వంగి ప్రణామం చేయడం (రుకూ)
5. సాష్టాంగప్రణామం చేయడం (సజ్దా)
6. నమాజు చివరలో కూర్చోవడం (ఖాయిద)
7. పూర్తి స్పృహతో నమాజు ముగించడం (సలాము చేయడం)

నమాజు చేయడం మనకు తెలుసు. నమాజు సంకల్పం చేస్తు **'అల్లాహు అక్బర్'** అంటూ రెండు చేతులు చెవుల వరకు ఎత్తి నమాజు ప్రారంభిస్తాం. ఇక అటు ఇటు చూడడం గాని, మాట్లాడడం గాని, తిరగడం గాని ఉండదు. **అల్లాహు అక్బర్** అంటూ నమాజు ప్రారంభించడం అవసరం. అలా చెయ్యనిచో నమాజు కాదు. నమాజు నియ్యత్ (సంకల్పం)చేసి నిలబడాలి. కనీసం దివ్యఖుర్ఆన్ నుండి ఒక సూర లేదా మూడు ఆయత్‌లు చదివేంతవరకైనా నిలబడాలి. ఖుర్ఆన్ నుండి కనీసం ఇంతమటుకైనా చదవాలి. దీని తర్వాత రుకూ చేస్తాం. ఇలా రుకూ చెయ్యడం కూడా అవసరం. వీటన్నిటిలో ఏది చెయ్యకపోయినా నమాజు కాదు. రుకూ తరువాత మళ్లీ నిలబడి, ఆ తరువాత సజ్దా చేస్తాం. చివరిలో కొద్ది సేపు కూర్చుండి. అత్తహియ్యాత్ , దరూద్ పఠిస్తాం. వీటన్నిటిలో ఏది లోపించినా నమాజు కాదు. తరువాత 'సలాం' చెబుతాం. అంటే నమాజు పూర్తి చేశామని సంతృప్తి చెందడమే. ఇక నమాజు నుండి బయటికి వచ్చినట్లే. ఈ విధంగా ఏ దోషం లేకుండా నిండు మనస్సుతో పూర్తి నమాజు ముగించుకొంటాం.

నమాజు ముగించుకోవడానికి మొత్తం పదునాలుగు విషయాలు పాటిస్తాం. నమాజు ప్రారంభించడానికి ముందు ఏడు విషయాలు, నమాజు ప్రారంభించినప్పటి నుంచి ముగించుకొనేంత వరకు ఏడు విషయాలు. మొదటి ఏడింటిని నమాజు షరతులంటాం. తరువాత ఏడు విషయాలను నమాజు 'అరకాన్' (స్థంభాలు) అని అంటాం. ఈ పదునాలుగులో ఏ విషయం లోపించినా నమాజు చెడిపోతుంది. అందుచేతనే వీటి విషయంలో బహు శ్రద్ధాశక్తులు చూపిస్తాం. ఎందుకు చూపం! అశ్రద్ధ వహించి మన నమాజులను మనము చెడగొట్టుకొంటమా?

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వండి.**

1. నమాజ్ మూల స్థంభాలు ఎన్ని?
2. తక్బీరె తహ్రీమ అంటే ఏమిటి?
3. సలామ్ తిరుగుతూ ఏ విషయాన్ని ప్రకటిస్తాం?
4. ప్రతి నమాజ్‌లో ఎంత మేరకు ఖిరాత్ తప్పనిసరిగా చేయాలి?
5. అత్తహియ్యాత్, దరూద్ ఎప్పుడు చదవాలి?

**(ఆ) క్రింద నమాజ్ నిబంధనలు, మూల స్థంబాలు అపక్రమరీతిలో ఇవ్వడం జరిగింది. వాటిని శ్రద్ధగా చదివి వరుస క్రమంలో నమాజ్ నిబంధనలను, మూల స్థంభాలను స్పష్టంగా వ్రాయండి?**

అల్లాహుఅక్బర్ అనాలి.
ధరించిన బట్టలు పరిశుభ్రంగా ఉండాలి.
వేళకు సరిగా నమాజులు చేయాలి.
రుకూ చేయాలి.
ఖియామ్ చేయాలి.
దేహం పరిశుభ్రంగా ఉండాలి (అందులో వుజూ కూడా ఉంది).
నమాజ్ చివరలో కూర్చోవాలి.
నమాజ్ చేసే స్థలం పరిశుభ్రంగా ఉండాలి.
పూర్తి స్పృహతో నమాజ్ ముగించాలి (సలామ్ చేయాలి)
నమాజ్ కోసం సంకల్పం చేయాలి.
సజ్దా (సాష్టాంగ ప్రమాణం) చేయాలి.
ఖిబ్లా వైపు ముఖం ఉంచాలి.
సతర్ (కనీస ఆచ్ఛాదనా శరీర భాగం) కప్పుకోవాలి.
ఖుర్‌ఆన్‌లో కొద్ది భాగం పఠించాలి.

**(ఇ) ఈ క్రింది ఖాళీలను పూరించండి.**

1. నమాజ్ ముగించుకోవడానికి మొత్తం ......................విషయాలను పాటిస్తాం.
2. నమాజు ప్రారంభించడానికి ముందు ఏడు విషయాలను................................అంటారు.
3. నమాజు ప్రారంభించినప్పటి నుంచి ముగించుకునేంత వరకు ఏడు విషయాలను.................. అంటారు.
4. ఈ...........................లో ఏ విషయం లోపించినా నమాజ్ చెడి పోతుంది.

**(ఈ) ఇవి చేసి చూపించండి.**

వుజూ, ఖియామ్, ఖాయిద, తక్బీరె తహ్రీమ, రుకూ, సజ్దా, సలామ్ తిరగడం

# 12. నమాజులో మనము చదివేదేమిటి?

నమాజులో చదివేదంతా మనము కంఠస్థం చేసుకొంటాం. కాని అదంత అరబ్బీ భాషలో ఉంది. అందుచేత పూర్తిగా అర్థం తెలియదు. నమాజులో ఉంటూ మనము అల్లాహ్‌ను ఏమని స్తుతిస్తున్నాం? ఇది తెలుసుకోవడానికి అరబ్బీలో చదివే వాటి అర్థం క్రమంగా తెలుసుకొనే ప్రయత్నం చేస్తాం. అజాన్ నుండి నమాజు ముగించి 'సలాం' చేసేంత వరకు చదివే వాటి అర్థం వినండి. ఇవేకాక ఇంకా అనేక సూరాలు, 'దుఆ'లు వాటి అర్థంతో మున్ముందు నేర్చుకోవాలి.

اَللهُ اَكْبَرْ اَللهُ اَكْبَرْ
اَللهُ اَكْبَرْ اَللهُ اَكْبَرْ

**అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్**
**అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్**
అల్లాహ్ గొప్పవాడు (నాలుగుమార్లు)

اَشْهَدُ اَنْ لَّآ اِلٰهَ اِلَّا اللهُ
اَشْهَدُ اَنْ لَّآ اِلٰهَ اِلَّا اللهُ

**అష్‌హదు అల్లా ఇలాహ ఇల్లల్లాహ్,**
**అషహదు అల్లా ఇలాహ ఇల్లల్లాహ్**
అల్లాహ్ తప్ప మరేదీ ఆరాధనకు అర్హమయినది కాదని నేను సాక్ష్యమిస్తున్నాను.

اَشْهَدُ اَنَّ مُحَمَّدًا رَّسُوْلُ اللهِ
اَشْهَدُ اَنَّ مُحَمَّدًا رَّسُوْلُ اللهِ

**అష్‌హదు అన్న ముహమ్మద్రసూలుల్లాహ్**
**అష్‌హదు అన్న ముహమ్మద్రసూలుల్లాహ్**
ముహమ్మద్ (సఅసం) అల్లాహ్ సందేశహరుడని నేను సాక్ష్యమిస్తున్నాను.

حَيَّ عَلَى الصَّلٰوةِ حَيَّ عَلَى الصَّلٰوةِ

**హయ్యు అలస్సలాహ్, హయ్యు అలస్సలాహ్**
నమాజ్‌కై రండి, (రెండు మార్లు - కుడి వైపునకు తిరిగి)

حَيَّ عَلَى الْفَلَاحِ حَيَّ عَلَى الْفَلَاحِ

**హయ్యు అలల్ ఫలాహ్, హయ్యు అలల్ ఫలాహ్**
సాఫల్యం వైపునకు రండి, (రెండు మార్లు - ఎడమ వైపునకు తిరిగి)

اَللهُ اَكْبَرْ اَللهُ اَكْبَرْ

**అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్**
అల్లాహ్ గొప్పవాడు (రెండుసార్లు)

لَا اِلٰهَ اِلَّا اللهُ

**లా ఇలాహ ఇల్లల్లాహ్**
అల్లాహ్ తప్ప ఆరాధనకు యోగ్యమయినది ఏదీ లేదు.)

سُبْحَانَكَ اللّٰهُمَّ وَبِحَمْدِكَ وَتَبَارَكَ اسْمُكَ وَتَعَالٰى جَدُّكَ
وَلَآ اِلٰهَ غَيْرُكَ

**సుబ్‌హానకల్లాహుమ్మ వ బి హమ్దిక వతబారకస్ముక వతఆలా జద్దుక వలా ఇలాహ గైరుక్.**

అల్లాహ్, నీవు పరిశుద్ధమయినవాడివి. స్తోత్రం కూడా నీకే చెల్లు. నీ పేరు ఎంతో శుభప్రదమయింది. నీ గొప్పతనం ఎంతో ఉన్నతమయింది. నీవు తప్ప మరే ఆరాధ్యుడే లేడు.

**అవూజు బిల్లాహి మినష్షయితా నిర్రజీమ్** اَعُوْذُ بِاللّٰهِ مِنَ الشَّيْطٰنِ الرَّجِيْمِ

అల్లాహ్ శరణు వేడుకుంటున్నాను - ఛీత్కరింపబడిన షైతాన్ బారి నుండి.

**సుబహాన రబ్బి అల్ అజీమ్** سُبْحَانَ رَبِّيَ الْعَظِيْمِ

మహోజ్వలుడయిన నా ప్రభువు పరమ పవిత్రుడు.

**సమి అల్లాహు లిమన్ హమిద,** سَمِعَ اللّٰهُ لِمَنْ حَمِدَهٗ

**అల్లాహుమ్మ రబ్బనా లకల్ హమ్ద్** اَللّٰهُمَّ رَبَّنَا لَكَ الْحَمْدُ

**సుబహాన రబ్బియల్ ఆలా** سُبْحَانَ رَبِّيَ الْاَعْلٰى

ఉన్నతుడయిన నా ప్రభువు పరిశుద్ధుడు అని మూడుసార్లు పఠించాలి.

اَلتَّحِيَّاتُ لِلّٰهِ وَالصَّلَوَاتُ وَالطَّيِّبَاتُ اَلسَّلَامُ عَلَيْكَ اَيُّهَا
النَّبِيُّ وَرَحْمَةُ اللّٰهِ وَبَرَكَاتُهٗ اَلسَّلَامُ عَلَيْنَا وَعَلٰى عِبَادِ اللّٰهِ
الصَّالِحِيْنَ اَشْهَدُ اَنْ لَّآ اِلٰهَ اِلَّا اللّٰهُ وَاَشْهَدُ اَنَّ مُحَمَّدًا
عَبْدُهٗ وَرَسُوْلُهٗ

**అత్తహియ్యాతు లిల్లాహి వస్సలవాతు వత్తయ్యిబాతు అస్సలాము అలైక అయ్యుహన్నబియ్యు వరహ్మతుల్లాహి వ బరకాతుహు. అస్సలాము అలైనా వ అలా ఇబాదిల్లాహి స్సాలిహీన్. అష్హదు అల్లా ఇలాహ ఇల్లల్లాహు వ అష్హదు అన్న ముహమ్మదన్ అబ్దుహూ వ రసూలుహ్.**

సకల శరీర సంబంధమయిన, ధన సంబంధమయిన నోటి సంబంధమయిన ఆరాధనలు అల్లాహ్‌కే చెల్లు. ఓ ప్రవక్తా! మీపై శాంతి నెలకొనుగాక, అల్లాహ్ కారుణ్యం, ఆయన శుభాలు వర్షించుగాక! మాపై, అల్లాహ్ దాసులయిన సజ్జనులపై శాంతి నెలకొనుగాక. అల్లాహ్ తప్ప మరే ఆరాధ్యుడు లేడని నేను సాక్ష్యమిస్తున్నాను. ముహమ్మద్ (సఅసం) అల్లాహ్ దాసుడు, సందేశహరుడని కూడా నేను సాక్ష్యమిస్తున్నాను.

అష్హదు అల్లా ఇలాహ ఇల్లల్లాహు అని పఠించేటప్పుడు చూపుడు వ్రేలు (కలిమా వ్రేలు)ను సూచనప్రాయంగా లేవనెత్తి మళ్లీ మామూలుగా ఉంచివెయ్యాలి.

రెండు రకాతుల నమాజ్ అయితే తషహ్హుద్ తరువాత దిగువన ఇచ్చిన దరూదె ఇబ్రాహీమ్ పఠించాలి:

اَللّٰهُمَّ صَلِّ عَلٰى مُحَمَّدٍ وَّعَلٰى اٰلِ مُحَمَّدٍ كَمَا صَلَّيْتَ عَلٰى
اِبْرَاهِيْمَ وَعَلٰى اٰلِ اِبْرَاهِيْمَ اِنَّكَ حَمِيْدٌ مَّجِيْدٌ اَللّٰهُمَّ
بَارِكْ عَلٰى مُحَمَّدٍ وَّعَلٰى اٰلِ مُحَمَّدٍ كَمَا بَارَكْتَ عَلٰى
اِبْرَاهِيْمَ وَعَلٰى اٰلِ اِبْرَاهِيْمَ اِنَّكَ حَمِيْدٌ مَّجِيْدٌ

**అల్లాహుమ్మ సల్లి అలా ముహమ్మదిన్, వ అలా ఆలి ముహమ్మదిన్ కమాసల్లైత అలా ఇబ్రాహీమ వ అలా ఆలి ఇబ్రాహీమ, ఇన్నక హమీదున్మ్మజీద్. అల్లాహుమ్మ బారిక్ అలా ముహమ్మదిన్ వ అలా ఆలి ముహమ్మదిన్ కమాబారక్త అలా ఇబ్రాహీమ వ అలా ఆలి ఇబ్రాహీమ ఇన్నక హమీదున్మ్మజీద్.**

అల్లాహ్! ఏ విధంగానయితే నీవు ఇబ్రాహీమ్‌పైనా ఇబ్రాహీమ్ అనుచరులపైనా నీ కారుణ్యాన్ని, నీ శుభాలను అవతరింపజేశావో అదే విధంగా ముహమ్మద్‌పైనా, ముహమ్మద్ అనుచరులపైనా నీ కారుణ్యాన్ని, నీ శుభాలను వర్షింపజెయ్యి. నిస్సందేహంగా నీవే సకల స్తోత్రాలకు అర్హుడవు నీవే పరమ పవిత్రుడవు.

اَلسَّلَامُ عَلَيْكُمْ وَرَحْمَةُ اللّٰهِ

**అస్సలాము అలైకుమ్ వరహ్మతుల్లాహి**

శాంతి, అల్లాహ్ కారుణ్యం నీపై కలుగుగాక.

**హయ్య అల్ ఫలాహ్** حَيَّ عَلَى الْفَلَاحِ తరువాత తక్బీర్ (అఖామత్), ఉదయం నమాజ్ పిలుపులో చెప్పబడే రెండు పలుకుల అర్థం కూడా తెలుసుకుందాం.

**నమాజు కోసం నిలబడదాం.** قَدْ قَامَتِ الصَّلٰوةُ (۲ بار)

**నిద్రకంటే నమాజు మేలు.** اَلصَّلٰوةُ خَيْرٌ مِّنَ النَّوْمِ (۲ بار)

ఇవే కాకుండా నమాజుల తరువాత చేసే దుఆ, నమాజులలో చదివే సూరాలు ముమ్మందు చదువగలం.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ఖాళీలను పూరించండి.**

1, అజాన్ ప్రారంభంలో అల్లాహుఅక్బర్.....................సార్లు పలకాలి.

2. అల్లాహుఅక్బర్ అంటే................................

3. అష్హదుఅల్లాయిలాహా ఇల్లల్లాహ్ అంటే....................................

4. అష్హదు అన్న ముహమ్మదర్రసూలుల్లాహ్ అంటే...............................

5. హయ్య అలస్సలాహ్ అంటే......................................

6. హయ్య అలల్ ఫలాహ్ అంటే..............................

**(ఆ) ఈ క్రింది వాటిని జత చేయండి.**

| | |
|---|---|
| 1. అవూజు బిల్లాహి మనష్షైతానిర్రజీమ్ | 1. ఓ మా ప్రభూ! సకల స్తోత్రాలు నీ కొరకే |
| 2. బిస్మిల్లాహిర్రహ్మానిర్రహీమ్ | 2. అల్లాహ్ అతని మాట విన్నాడు ఎవరయితే అతన్ని స్తుతించాడో. |
| 3. సుబ్హాన రబ్బియల్ అజీమ్ | 3. అనంతకరుణామయుడు పరమ కృపాశీలుడైన అల్లాహ్ పేరుతో ప్రారంభిస్తున్నాను |
| 4. సమిఅల్లాహులిమన్ హమిద | 4. నా ప్రభువు పరమ పవిత్రుడు, ఆయనే గొప్పవాడు, |
| 5. రబ్బనాలకల్ హమ్ద్ | 5. ఛీత్కరించబడిన షైతాన్ బారి నుంచి అల్లాహ్ శరణు వేడుకుంటున్నాను. |
| 6. సుబ్హాన రబ్బియల్ ఆలా | 6. నా ప్రభువు ఉన్నతుడు, పరిశుద్ధుడు. |

## చేయాల్సిన మరి కొన్ని పనులు

(ఇ) సనా మరియు దాని తర్జుమా వినిపించండి.

(ఈ) తషహ్హుద్ మరియు దాని తర్జుమా వినిపించండి.

(ఉ) దరూదె షరీఫ్ మరియు దాని తర్జుమా వినిపించండి.



# 13. మన పండుగలు

జీవితం సంతోష సంఘటనల సముదాయం. ఒకప్పుడు వివాహమహోత్సవాలు, మరొకప్పుడు విందులు, వినోదాలు, ఇంకోప్పుడు కొత్తింటి సంబరాలు ఇంకా మన పొరిగింటివారు, మిత్రులు ఆప్తులు జరుపుకొను ఉత్సవాలలో పాల్గొనడం జరుగుతూనే ఉంటుంది. ఈ సందర్భాలలో అందురు కలసిమెలసి ఉంటాం. అందరు మంచి మంచి బట్టలు వేసికొని వస్తారు. సంబరంతో విందు భోజనాలనారగించి సంతోషంగా సమయాన్ని గడుపుతాం. ఇలాంటి సన్నివేశాలన్నిటిలో జనం కొందరు మాత్రమే సమావేశమవుతారు. బంధుమిత్రులు ఆప్తులు స్నేహితులు, ఇంకా కొందరు ఈ సంతోష సమాయల్లో ఆహ్వానాన్నందు కొని వస్తారు.

అల్లాహ్ ఏడాదికి రెండు మహాపర్వదినాలు మనకు ప్రసాదించాడు. ఈ పండుగ దినాలలో జనసందోహం ఎక్కువ. ఏ కొద్దిమందికి మాత్రమే పండుగ పరిమితం కాక, తెలిసిన వారు మొదలుకొని తెలియని వారి వరకు ఈ దేశస్థులు కాని పరాయి దేశస్తులు కాని విశ్వమందు ఏ మూల నివసించినా, ఏ ప్రాంతంలో ఉన్నా ముస్లిములందరు కలసిమెలసి పండుగ జరుపుకొంటారు.

ఈ పండుగులు విశిష్టమైన పర్వదినాలు.

1. ఉపవాసాల పండుగ **ఈదుల్ ఫితర్.**
2. ఖుర్బానీ పండుగ **ఈదుల్ అజ్హా**

## 1. ఈదుల్ ఫితర్

మన పండుగలలో ఈదుల్ ఫితర్ సుప్రసిద్ధ పండుగ. రమజాను నెల ఉపవాసాలు పూర్తి చేసు కోవడంతో ఈ పండుగ జరుపుకొంటారు. ఈ పండుగ కోసం ఇంటింటా సన్నాహాలు జరుగుతుంటాయి. అమ్మగారు మనకోసం రకరకాల బట్టలు కుట్టిస్తారు. కొత్త కొత్త పాదరక్షలు తెప్పిస్తారు, తలకు అందమైన టోపి కొనిపెడ్తారు. అక్కగారు చేతి రుమాలు తయారుచేస్తారు, అందమైన పూలు, లతలు దానిపై వేస్తారు. మహిళలు వారి వారి పసందైన దుస్తులు తయారు చేసుకొంటారు. దుస్తులపై ఎంబ్రాయిడరీ, పని చేసి అలంకరిస్తారు. ఏ కారణం చేతనైనా కొత్త బట్టలు తయారు చేసుకోలేకపోతే పాత బట్టలే ఉతుక్కుంటాం, చినిగి వుంటే కుట్టుకుంటాం. ఇంటిని శుభ్రపరచి అలంకరించుకొంటాం. పండుగ రోజు మంచి వంటలు చేసుకోవడానికి తీపి పదార్థాలు వండడానికి కావలసిన సామానాలు తెచ్చుకొంటాం. ఒకటేమిటి, పండుగ కోసం అనేక తయారీలు ఉంటాయి. పండుగ దగ్గరకు వస్తుంటే మా సంతోషం ఎల్లలు తెంచుకుంటు ముందుకు సాగుతుంది. దినదినం భారంగా గడుపుతాం. చివరి ఉపవాస దినం నెలవంక కోసం ఆకాశం పరికించి చూస్తాం. చంద్రుడు కనిపించగానే ఆనందంతో అందరికి సలాము చేస్తాం. శుభాకాంక్షల వర్షం కురిపిస్తాం. ఆ రాత్రి సరిగా నిద్ర కూడా పట్టదు. తెచ్చుకొన్న వస్తువుల్ని పరిశీలించుకొంటాం. ఏదైనా ఎక్కువ తక్కువలుంటే వాటిని చక్కపెట్టుకుంటాం. పండుగ సంబరం సంపూర్ణంగా ఉంటుంది.

పండుగ దినం వచ్చింది. ప్రాతఃకాలంలో నిద్ర మేల్కొంటాం. ఫజర్ నమాజు చేసి వచ్చాక స్నానం చేసుకొంటాం. మంచి మంచి దుస్తులు వేసుకొంటాం. సుగంధ పరిమళాలు పూసుకొంటాం. అమ్మా నాన్నల నుండి, అన్నయ్య, అక్కయ్య గార్ల నుండి పండుగ బహుమానం 'ఈది' తీసికొంటాం. నాన్నగారు కుటుంబంలోని సభ్యులందరి తరపున 'ఫితర్' అనే దానం ధాన్యం లేదా ధనం నుండి ఇస్తారు. ఒకప్పుడు ధాన్యం, మరొకప్పుడు డబ్బు తీసి వీధిలో, పొరుగులో ఉన్న బీదసాదలలో పంచి పెడతారు. పండుగ రోజు ఎవరు ఆకలి దప్పులతో ఉండరాదనేది దీని ప్రత్యేకత. కలవారు, కలిమిలేని వారు అందరు సమైక్యంగా కలిసి పండుగ జరుపుకొంటారు.

ఉదయం నుండి అమ్మగారు, అక్కగారు వంట గదిలో నోటిలో నీళ్ళూరే ఘుమఘుమ వంటలు చేయడం మొదలెట్టుతారు, రుచికి ప్రత్యేకత ఈ పండుగ వంటలు. సేమియాలు, హల్వా, కబాబ్, బిరియాని, ఖుర్మా ఇంకెన్నో వంటలు వండి, తిని, ఆనందపడతాం. ఇరుగుపొరుగు వారలకు గిఫ్ట్ ఇస్తాం. ఆ తరువాత 'ఈద్‌గాహ్' వైపు బయలుదేరి వెళ్తాం. చిన్నలు, పెద్దలు అందరూ ఉత్సాహంగా కదం తొక్కుతూ వెళ్తాం. దారిలో అందరి నోట తక్బీర్ పలుకులే. అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్, లా ఇలాహ ఇల్లల్లాహు అక్బర్ అల్లాహు అక్బర్ వ లిల్లాహిల్ హమ్ద్.

ఈద్ నమాజు ఎప్పుడు ఈద్‌గాహ్‌లోనే చేస్తాం. కొద్ది సేపట్లోనే ఈద్‌గాహ్ పండుగ నమాజు చేసే వారితో నిండిపోతుంది. నమాజుకు వచ్చిన ప్రతి ఒక్కరు ఆనందోత్సాహంతో పరవళ్ళు తొక్కుతుంటారు. అందరు మంచి మంచి బట్టలు వేసుకొని వస్తారు. ఎటు చూచినా సంతోషం వెల్లువే పండుగ దృశ్యం కన్నులకు ఇంపునిస్తుంది. మనోజ్ఞంగా కనబడే మానవ సమూహం చూచే వారికి స్ఫూర్తినిస్తుంది. అందరు బారులు తీరి నిలబడతారు. వరుసల్ని చక్కదిద్దుకొంటారు. ఇమాం సాహెబ్ వెనుక నిలబడి రెండు రకాతులు నమాజు సామూహికంగా చేస్తారు. ఇతర సామూహిక నమాజుల కంటే భిన్నంగా ఉంటుంది ఈద్ నమాజు. ఈ నమాజు కోసం అజాన్ ఉండదు, ఇఖామత్ కూడా ఉండదు. మొదటి తక్బీర్ తరువాత సుబ్‌హానక అల్లాహుమ్మ.... చదివి మూడుమార్లు తక్బీర్ పలుకుతాము, ఆ తరువాత రెండవ రకాతులో రుకూలో వెళ్ళేందుకు ముందు మూడు పర్యాయాలు అల్లాహు అక్బర్ అదనంగా అంటాం. జుమా దినాన నమాజుకు ముందు ఖుతుబ ఉంటుంది, పండుగలో 'ఖుతుబ'కు ముందు నమాజు చేస్తాం. సామూహికంగా అందరు నమాజు చేస్తారు. ఖుతుబ, దుఆ చేశాక అందరు ఒకరినొకరు కలిసి శుభాకాంక్షలు తెలుపుకొంటారు. ఈద్‌గాహ్ దగ్గర ఉత్సవ సంబరాలతో అంగళ్లు కూడా వుంటాయి. అనేక రకాల మిఠాయిలు అమ్మబడతాయి. ఆటలుంటాయి, ఈది డబ్బులతో తినడానికి మిఠాయి, ఆడుకోవడానికి క్రీడా సామానులు బొమ్మలు కొంటాం. తిరిగి ఇంటికి మరో త్రోవన పోతాం, సంతోషంతో పండుగ గడుపుతాం.

## 2. ఖుర్బాని పండుగ - ఈదుల్ అజ్‌హా

ఈదుల్ ఫితర్ షవ్వాల్ నెల మొదటి రోజున జరుపుకుంటాం. ఖుర్బానీ పండుగ రెండు మాసాలు కొద్ది దినములు గడిచాక 10వ రోజు జిల్‌హజ్ మాసంలో జరుపుకుంటాం. ఇది మన రెండవ మహా పర్వదినం. అల్లాహ్ ఉపవాస వ్రతాలను రమజాను మాసంలో పాటించమన్నాడు. ఆ ఉపవాసాలు

సక్రమంగా పూర్తి చేసుకొన్న ఆనందంలో ఈదుల్ ఫితర్ పండుగ జరుపుకొంటాం. కాని ఈదుల్ అజ్‌హాకు ఒక చరిత్ర ఉంది.

హజ్రత్ ఇబ్రాహీం (అలై) గారి జీవితంలో జరిగిన సంఘటనను పురస్కరించుకొని ఖుర్బానీ పండుగ జరుపుకొంటాం. హజ్రత్ ఇబ్రాహీం (అలై) ఒక కలకన్నారు. స్వప్నంలో తన ప్రియ కుమారుడు హజ్రత్ ఇస్మాయిల్ (అలై)ను అల్లాహ్ కోసం ప్రాణార్పణ చేస్తున్నారు. అల్లాహ్ ఆజ్ఞను పాలించడానికి హజ్రత్ ఇబ్రాహీం (అలై) తన ప్రియ పుత్రుని ప్రాణత్యాగం చేస్తున్న సమయంలో అల్లాహ్ ఆ బలిదానాన్ని ఆపాడు. హజ్రత్ ఇస్మాయిల్ స్థానంలో ఒక పొట్టేలు ఖుర్బాని ఇవ్వమన్నాడు. ముస్లింలందరు ఈ సంఘటనను స్మరించుకొంటూ ఖుర్బానీ చేస్తారు. ఈ ఖుర్బానీ మన దృఢ సంకల్పానికి ప్రతీక. అవసర మున్నప్పుడు మనం మన ధన ప్రాణాలను, ప్రియపుత్రుని ప్రాణాన్ని అల్లాహ్ మార్గంలో త్యాగం చేస్తాం అనే ప్రతిజ్ఞ ఈ ఖుర్బానీలో ఉంది.

ఈదుల్ ఫితర్‌లో కనబరచిన ఉల్లాసం ఈ పండుగలో కూడా ఉంది. జిల్‌హజ్ 9వ తేదీ ఫజర్ నమాజు తర్వాత ఈ పండుగ తయారీ ప్రారంభమవుతుంది. అప్పటి నుండే ప్రతి ఫరజ్ నమాజు తరువాత ప్రతి ఆరాధకుడు అల్లాహ్‌ను ఒక ప్రత్యేక నినాదంతో "అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్ లా ఇలాహ ఇల్లల్లాహు వల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్ వలిల్లాహిల్ హమ్ద్" అని స్మరిస్తాడు.

ఈ స్మరణ 13వ తేది అసర్ నమాజు వరకు ఉంటుంది. 'ఖుర్బాని' ఇవ్వడం 10,11, 12 తేదీలలో జరుగుతుంది. 10వ తేది ఉదయం మంచి మంచి బట్టలు వేసుకొని ఏదీ తినకుండా ముస్లిములు ఈద్‌గాహ్ చేరుతారు. ఈదుల్ ఫితర్ నమాజులాగే రెండు రకాతులు నమాజుచేస్తారు. దారిలో మాత్రం అల్లాహ్ స్మరణ నెమ్మదిగా కాకుండా బిగ్గరగా పఠిస్తూ వెళ్తారు. గ్రామాల్లో ఉండే ముస్లిములు పండుగ నమాజు కోసం పట్టణానికి రావలసి ఉంటే 'ఖుర్బానీ' చేసి పట్టణానికి వెళ్తారు. ఖుర్బానీ కోసం గొర్రె, మేక, పొట్టేలు, ఎద్దు జాతి, ఎనుము జాతి పశువులు కావాలి. వాటి ఖుర్బాని చేయగలరు. కాని గొర్రె, మేక మొదలుగు చిన్న పశువులలో ఖుర్బాని ఒక భాగమే ఉంటుంది, పెద్ద ఖుర్బాని పశువులలో ఖుర్బాని ఏడు భాగాలుగా లెక్కించబడుతుంది. కొందరు మొత్తం ఇంటి సభ్యుల తరపు నుండి ఒకే పశువు, చిన్నదైనా పెద్దదయినా సరే, ఖుర్బాని చేస్తారు. ఖుర్బాని కోసం తెచ్చే జంతువు ఆరోగ్యకరమైంది, లోపరహితమయింది, వయస్సులో ఆమోదయోగ్యమయిందిగా ఉండాలి.

పశువును ఖుర్బాని చేశాక దాని చర్మం విక్రయించి వచ్చిన డబ్బును దానం చేస్తారు. మాంసాన్ని మూడు సమభాగాలుగా చేసి ఒక భాగం బీదసాదలకు పంచుతారు, రెండవ భాగం పండుగ గిఫ్ట్‌గా బంధువుల్లో, స్నేహితుల్లో పంచిపెడతారు. మిగిలిన భాగం ఇంటిలో ఉపయోగించుకొంటారు. అవసరం ఉంటే ఈ భాగాలలో హెచ్చుతగ్గులు కూడా చేసుకొంటారు. ఈ పండుగ సందర్భంలోనే మక్కాలో హజ్ కూడా జరుగుతుంది. ఇవే మన రెండు పండుగలు. ఈ రెండింటిలోనూ ఉత్సాహాలతో పాటు సంతోషాన్ని కూడా అల్లాహ్ చిరస్థాపితం చేశాడు.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి.**

1. ప్రపంచ వ్యాప్తంగా ముస్లిములు జరుపుకునే పండుగ ఏది?
2. ఫిత్రా ఎందుకు చెల్లించడం జరుగుతుంది?
3. ఈదుల్ అజ్హా ఏ సంఘటనకు గుర్తుగా జరుపుకుంటారు?
4. ఖుర్బానీ ఇవ్వడం ద్వారా మనం ఏ సంకల్పాన్ని చాటుతాం?
5. ఈద్ నమాజ్ ఏ విషయాల్లో ఇతర నమాజుల కంటే వేరుగా ఉంటుంది?
6. ఏ తేదీల్లో ఖుర్బానీ ఇవ్వాలి?
7. ఖుర్బానీ మాంసాన్ని ఎలా పంపిణీ చేయాలి?

**(ఆ) క్రింది వాటిని జత పరచండి.**

| | | |
|---|---|---|
| 1. | ఈదుల్ ఫిత్ర్ | ఒక భాగం |
| 2. | ఈదుల్ అజ్హా | ఏడు భాగాలు |
| 3. | హజ్రత్ ఇబ్రాహీమ్ (అ) | షవ్వాల్ ఒకటో తేదీ |
| 4. | పొట్టేలు, మేక | జిల్ హజ్జ పదో తేదీ |
| 5. | పెద్ద జంతువులు | హజ్రత్ ఇస్మాయీల్ (అ) |

**(ఇ) క్రింది వాటిని వివరించండి.**

1. మీరు పండుగను ఎలా జరుపుకుంటారో తెలపండి.
2. మీకు ఎంత మొత్తంలో ఈదీ (పండుగ బహుమానం) వచ్చింది. వాటిని మీరు ఎలా ఖర్చు చేశారో తెలపండి.

## చేయాల్సిన మరి కొన్ని పనులు

1. ఈద్ నమాజ్ చేసి చూపించండి.
2. తక్బీర్ కంఠస్తం చేయండి.

# 14. సభ్యతా సంస్కార విషయాలు

మనం సమాజంలో ఉంటున్నాం. రేయింబవళ్లు ఎన్నో పనులు చేస్తుంటాం, ఎన్నో చోట్ల వెళ్తుంటాం. మసీదుకు వెళ్తాం, పాఠశాలకు పోతాం, సమావేశాల్లో పాల్గొంటాం, ఆటల పోటీలు చూడడానికి హాజరవుతాం, విందులు, వినోదాలలో ఇతరులతో కలసి ముచ్చటిస్తాం. కార్యక్రమాలను చక్కగా జరుపాల్సి ఉంటుంది. ఈ పనుల నిర్వహణలో పాటించాల్సిన నీతి నియమాలున్నాయి. వాటిని కనుక దృష్టిలో పెట్టుకొని మెలిగామంటే అందరికీ అవి సుఖప్రదమవుతాయి. ఆ నియమాలను పాటించకపోయామంటే అందరికీ దుఃఖం కలుగుతుంది. కార్యదక్షత కలవారు నీతి నియమాలు పాటిస్తారు, అందుచేత వారు అందరి మెప్పు పొందుతారు. నీతి నియమాలు పాటించని వారి పనులు రాణించవు. వారిని ఎవరు అభినందించరు కూడా.

### 1. మసీదు విషయంలో పాటించాల్సిన నియమాలు

మసీదు అల్లాహ్ దర్బారు. అందుచేత మసీదు విషయంలో జాగ్రత్త పడుతాం, పాటించాల్సిన అన్ని నియమాలననుసరిస్తాం.

1. మసీదులో కుడికాలు అడుగువేస్తూ సలాము చేస్తూ ప్రవేశిస్తాం. మసీదు నుండి బయటకు వచ్చే సమయంలో ఎడమ పాదం బయట పెట్టుతూ, సలాము చేస్తూ నిష్క్రమిస్తాం.
2. మసీదులోకి ప్రవేశిస్తూ **"అల్లాహుమ్మఫ్తహ్‌లీ అబ్‌వాబరహ్‌తిక"** అని దుఆ చేస్తాం.
3. మసీదు నుండి నిష్క్రమిస్తూ **"అల్లాహుమ్మ ఇన్నీ అస్‌అలుక మిన్ ఫజ్‌లిక్"** అని దుఆ చేస్తాం.
4. మసీదులో అల్లరి చెయ్యడం కాని, అవరోధం సృష్టించడం కాని, హాస్య పరిహాసం కాని ప్రాపంచిక విషయాలు మాట్లాడుకోవడం కాని వుండదు.
5. ఉజూ చేసి మసీదులో ఓ వైపు మౌనంగా కూర్చుంటాం. ఒకవేళ సమయమే ఉన్నట్లయితే రెండు రకాతులు సున్నతు నమాజు చేసుకొంటాం.
6. మసీదు పరిశుభ్రతను కాపాడుతాం. అందులో చెత్త చెదారం వేయం, మలినం, దుర్వాసన కాని లేకుండా జాగ్రత్త తీసుకొంటాం.
7. లభ్యమైన సుగంధ పరిమళాలను పూసుకొని వెళ్ళుతాం. కంపుకొట్టే నీరుల్లి, వెల్లుల్లి తిని మసీదుకు వెళ్ళం. వీటి దుర్వాసన ఉంటే మంచిగా నోరు కడుక్కొని వెళ్తాం.

### 2. తరగతి నియమాలు

1. క్లాసులో ప్రవేశించే సమయంలో సలాం చేస్తాం. తరగతి ముగిశాక సలాము చేసి వెళ్తాము.
2. ఒకవేళ నేల మీద పరుచుకొని కూర్చునేట్లయితే ఒకవైపు చెప్పులు, బూట్లు, మేజోళ్ళు చక్కగా పెట్టి కూర్చుంటాం.
3. తరగతిలో నిశ్శబ్దంగా కూర్చుంటాం. గురువు బోధనను శ్రద్ధగా వింటాం.

4. ప్రశ్నలకు జవాబులివ్వడానికి మనవంతు వచ్చేంత వరకు ఓపిక పట్టి కూర్చోవాలి.
5. మల మూత్ర విసర్జన కోసం తరగతి నుండి బయటకు వెళ్ళాల్సి వస్తే గురువుగారి అనుమతితో వెళ్తాం. గురువుగారు తరగతిలో లేనట్లయితే మానేటరు అనుమతి తీసుకొంటాం.
6. వేరే తరగతిలో ఏదైనా పని పడితే అనుమతి తీసుకొని ఆ తరగతి గదిలో వెళ్తాం.
7. తరగతి గదిని పరిశుభ్రంగా పెట్టుతాం. తరగతిలోని వస్తు సామగ్రిని శుభ్రపరిచి, దుమ్ము ధూళి దులిపి సక్రమంగా పెట్టి తరగతిని అలంకరిస్తాం. చెత్త, కాగితపు ముక్కలు, పండ్లతొక్కలు మొదలైనవి ఏరి చెత్తకుండీలో పడేస్తాం. తరగతి గదిని శుభ్రపరచి ఆకర్షణీయంగా అలంకరిస్తాం.

### 3. అన్నపానీయాల విషయంలో పాటించాల్సిన నియమావళి

1. భోజనానికి కూర్చోడానికి ముందు చేతులు కడుక్కొంటాం, నోటిని శుభ్రపరచుకొని కూర్చుంటాం.
2. బిస్మిల్లాహ్ అని అంటూ ఒక వైపు నుండి భోజనం తిన నారంభిస్తాం.
3. ఒకే పళ్ళెంలో ఒకరికంటే ఎక్కువ మంది ఒకేసారి భోజనం చేస్తే తమ తమ ముందున్న భోజనం తినాలి, ఇక్కడ అక్కడ లేదా మంచి మంచి వాటిని ఏరుకొని చేయిచాచి తీసుకోము.
4. చిన్న ముద్దలు చేసి భుజిస్తాం. ఆహారాన్ని బాగా నమలి తింటాం. అన్నం క్రింద పడకుండా జాగ్రత్త పడతాం. భుజించే సమయంలో నోటి నుండి శబ్దం రాకుండా నెమ్మదిగా తింటాం. అతి వేడి పదార్థాలు తినం. వేడిగా వుంటే నోటితో ఊది చల్లగా చేయం కూడా.
5. భోజనానికి పేర్లు పెట్టకుండా తింటాము, ముఖాన్ని చిట్లించుకొంటూ తినం. దొరికిన భోజనం సంతోషంతో చిరునవ్వుతో భుజిస్తాం. నచ్చని వస్తువు తినకుండా అందులోని లోపాన్ని లెక్కించకుండా ఉంటాం.
6. నడుస్తూ నిలబడి, పరుండి లేదా వీపు ఆనిచ్చి ఏదీ తినం.
7. నీటిని త్రాగే సమయంలో గ్లాసును ఒక చేతితో పట్టుకొని మరో చేతినానించి కొద్ది కొద్దిగా త్రాగుతూ మూడు సార్లు ఊపిరి తీసుకొంటాం. ప్రతిమారు గ్లాసును నోటి నుండి దూరం చేస్తాం. ఊపిరి తీసుకొంటాం. నీటిన త్రాగిన పిమ్మట **అల్‌హమ్దులిల్లాహ్** అని అంటాం.
8. భోజనానంతరం నీటిని త్రాగిన పిమ్మట అల్లాహ్‌ను స్తుతిస్తూ ఈ 'దుఆ'ను చేస్తాం.

**అల్‌హమ్దులిల్లాహిల్లజీ అత్‌అమనా, వసఖానా, వజఅలన మినల్‌ముస్లిమీన్**

### 4. మాట ముచ్చట చేసే నియమాలు

1. మాట్లాడే సమయంలో బిగ్గరగా అరవకూడదు. వినీ వినబడని శబ్దం కాకుండా శ్రోత సునాయాసంగా విన వీలైనట్లుగా మాట్లాడుతాం.
2. ఎవరైనా ఏదైనా చెబితే దానిని ఖండించం. ఎవరైనా ఇద్దరు వ్యక్తులు సంభాషించుకుంటుంటే వారి మధ్య వెళ్ళి ముచ్చటించ ప్రయత్నించం. మా వంతు వచ్చేంత వరకు వేచి ఉంటాం.
3. ఎవరైనా మాట్లాడితే శ్రద్ధాశక్తులతో వింటాం. అశ్రద్ధ వహించం.

4. అనవసరంగా మాట్లాడం. పరుషపు మాట పలుకం. తొందరతొందరగా లేదా అవసరానికంటే ఎక్కువ మాట్లాడం.
5. అందరితో గౌరవంగా మాట్లాడుతాం. పెద్దవారితో మాట్లాడే సమయంలో ప్రత్యేక శ్రద్ధతో, గౌరవంతో మాట్లాడుతాం.
6. పెద్దవారి ప్రశ్నలకు అణుకువతో సమాధానమిస్తాం. వేళాకోళంగా, గీక్కొంటూ ముక్కులో వేలు వేసి గిల్లుకొంటూ జవాబివ్వం.
7. ఇద్దరు వ్యక్తులు గోప్యంగా మాట్లాడుకొంటుంటే వాటి సంభాషణ వినం వారి దగ్గరికెళ్ళి వినడానికి ప్రయత్నం కూడ చెయ్యం.

## 5. సమావేశపు నియమాలు

1. సమావేశాల్లో ఎక్కడ స్థలం దొరికితే అక్కడే కూర్చుంటాం. వరసల్ని చీల్చి ముందుకు వెళ్ళి ప్రముఖస్థానం పొందడానికి ప్రయత్నించం.
2. నీరుల్లి, వెల్లుల్లి తిని దుర్వాసన పదార్థాల్ని వెంట తీసుకొని వెళ్ళం. పరిశుభ్రమైన మంచి దుస్తులు ధరించి వెళ్తాం. పరిమళం ఉంటే పూసుకొని వెళ్తాం.
3. వెళ్ళిన చోట సభ్యత సంస్కృతులతో కూర్చుంటాం. ముచ్చట్లు గాని, అల్లరిగాని చేస్తూ కూర్చోం.
4. సమావేశ కార్యక్రమాన్ని మౌనంగా తిలకిస్తూ ఉపన్యాసాలను ఆలకిస్తాం.
5. దగ్గర ఉన్న వారి చెవులు కొరక్కుండా, ఇతరుల్ని అవహేళన చెయ్యకుండా ఉంటాం.
6. వచ్చేపోయేవారికి దారి ఇచ్చి కూర్చుంటాం. ప్రజలు వలయాకారంలో కూర్చుంటే వారి మధ్యకు దూరి కూర్చోం.
7. కూర్చున్న వారిని లేపి వారి స్థలంలో కూర్చోవడం తప్పు. స్వయంగా ఉన్నత స్థానానాక్రమించడానికి ప్రయత్నించము.
8. అక్కడ ఇక్కడ నిలుచోడానికి ప్రయత్నించం. తిరుగాడుతూ కనబడం. మారుమారు తలెత్తి చూడం, ఒక చోట మౌనంగా వినమ్రతతో కూర్చుంటాం.

ఈ విధంగా సభ్యతా సంస్కారాలతో నడచుకొంటే మనశ్శాంతి కలుగుతుంది. అందరూ మనల్ని గౌరవిస్తారు, ఇస్లాం సభ్యతా సంస్కారాలను అభిలషిస్తుంది. అలాంటి సమాజాన్ని నిర్మించుకోవడానికి నియమాలను సూచిస్తుంది.

## అభ్యాసం

**(అ) క్రింది ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వండి.**

1. ఏదైనా అవసరం లేదా పని కోసం తరగతి నుంచి బయటికి వెళ్లాలంటే ఎవరి అనుమతి తీసుకుని వెళతారు?
2. తరగతి గదిని పరిశుభ్రంగా ఉంచడం కోసం ఏం చేస్తారు?
3. నీళ్లు త్రాగే మర్యాదలు ఏమిటో తెలపండి?
4. పెద్దలతో ఎలా మాట్లాడాలి?
5. మీరు ఏదైనా సమావేశానికి వెళితే ఎలా కూర్చుంటారు?
6. భోజనం చేసేటప్పుడు ఏ ఏ పనులు చేయకూడదు?

**(ఆ) క్రింద మంచి పిల్లల, అల్లరి పిల్లల లక్షణాలు వ్రాయడం జరిగింది. వాటిని శ్రద్ధగా చదివి ఏవి మంచి పిల్లల లక్షణాలో, ఏవి అల్లరి పిల్లల లక్షణాలో ముందు ఇచ్చిన బాక్కుల్లో 'మంచి పిల్లలు' 'అల్లరి పిల్లలు' అని వ్రాయండి.**

1. మస్జిద్‌లో అల్లరి చెయ్యడం, హాస్యమాడడం, ప్రాపంచిక విషయాలు మాట్లాడుకోవడం లాంటివి చేయరు. (   )
2. నేల మీద పరుచుకుని కూర్చునేట్లయితే ఒక వైపు చెప్పులు, బూట్లు, మేజోళ్లు చక్కగా పెట్టి కూర్చుంటారు. (   )
3. ప్రశ్నలకు జవాబులివ్వడానికి మన వంతు వచ్చేంత వరకు  ఓపిక పట్టికూర్చోరు. (   )
4. బిస్మిల్లాహ్ పలికి ఒకవైపు నుంచి భోజనం తిననారంభిస్తారు. (   )
5. ఇద్దరు వ్యక్తులు మాట్లాడుకుంటున్నప్పుడు మధ్యలో మాట్లాడతారు. (   )
6. సమావేశాల్లో ఎక్కడ స్థలం దొరికితే అక్కడ కూర్చోరు. వరసల్ని చీల్చు కుంటూ ముందుకు వెళతారు. (   )

**(ఇ) క్రింది వాటిని జత పరచండి.**

| | | |
|---|---|---|
| 1. | మస్జిద్ విషయంలో పాటించాల్సిన నియమాలు | వేళాకోళంగా గీక్కుంటూ ముక్కులో వేలు వేసి గిల్లుకుంటూ జవాబివ్వం. |
| 2. | అన్నపానీయాల విషయంలో పాటించాల్సిన నియమాలు | వచ్చే పోయే వారికి దారి ఇచ్చి కూర్చుంటాం. |
| 3. | సంభాషణా నియమాలు | నోటి నుంచి శబ్దం రాకుండా నెమ్మదిగా తింటాం. |
| 4. | సమావేశపు నియమాలు | అవకాశం ఉంటే కూర్చునే ముందు రెండు రకాతుల సున్నత్ నమాజ్ చేసుకుని కూర్చుంటాం. |

**(ఈ) ఈ క్రింది ఖాళీలను పూరించండి.**

1. పనుల నిర్వహణలో పాటించాల్సిన నీతి నియమాలను దృష్టిలో పెట్టుకుని మెలిగామంటే అందరికీ అవి......................
2. దుఆ చదువుతూ ....................................కాలు పెట్టి మస్జిద్‌లో ప్రవేశిస్తాం.
3. మస్జిద్‌లోకి దుర్వాసన కలిగించే.........................తిని వెళ్ళం.
4. వేరే తరగతిలో ఏదైనా పని పడితే.........................తీసుకుని ఆ తరగతి గదిలో వెళ్తాం.
5. సమావేశంలో ఉన్నప్పుడు పరస్పరం...................చేయం.
6. భోజనానికి కూర్చోడానికి ముందు......................కడుక్కుంటాం.

## చేయాల్సిన మరి కొన్ని పనులు

1. ఈ పాఠంలో తెలిపిన దుఆలను కంఠస్తం చేయండి. మీ తరగతి ఉపాధ్యాయునితో దాని భావాన్ని కూడా అడిగి తెలుసుకోండి.
2. వివిధ సందర్భాలలో పాటించవలసిన నియమాలను వాటిని చక్కగా వ్రాసి మీరు చదువుకునే, నిద్రపోయే గదులలో అతికించుకోండి. వాటిని మాటిమాటికి చదువుకుంటూ ఆచరించండి.



# 15. ఇతరుల హక్కులు - మన బాధ్యతలు

అల్లాహ్ కృపాదరణలతో ప్రగతి పథంలో నడుస్తున్నాం. కాని సాధించాల్సిందెంతో ఉంది. ఇంత వరకు నోచుకొన్నది పెద్దవారి దీవెనలు మాపై ఉండటం వల్లే. వారి ప్రయత్నం గురించి ఆలోచిస్తే వారి పట్ల మన గౌరవ మర్యాదలు ఎంతగానో పెరుగుతాయి.

ప్రపంచంలో పుట్టాం. పెద్దల సాంగత్యంలో పెరిగాం. తల్లిదండ్రులు గారాబంతో పెంచారు, వారు శ్రమ పడి సంపాదించిన డబ్బు మాపై వెచ్చించారు. ఎందరితోనో కలిసి మెలిసి ఆడుకొన్నాం. ఉత్సాహంగా, ఉల్లాసంతో కాలం గడిపాం. ఎందరో ఆదరించారు, కరుణతో చూచారు. వారందరికి మనపై హక్కులున్నాయి. చేసిన మేలు మరిచే కృతఘ్నులం కాము మనము.

## 1. అల్లాహ్‌కు మనపై ఉన్న హక్కులు

అందరికంటే ఎక్కువగా అల్లాహ్‌కు మనపై హక్కు ఉంది. ఆయనే మనల్ని సృష్టించాడు. మంచి సుఖాన్నిచ్చాడు. అవసరాలన్ని తీర్చాడు. మూగ జంతువుగ కాకుండా సృష్టిలో మిన్న అయిన మానవుల్లో జన్మింపజేశాడు. విద్యాబుద్ధులనిచ్చాడు, ప్రపంచంలో తన ప్రతినిధిగ (ఖలీఫాగ) జేశాడు. ముస్లిముల కుటుంబంలో జననమిచ్చి ఇస్లాం జీవిత విధానాన్ని పాటించడానికి సులభసాధ్యం చేశాడు. ఎన్నో అనుగ్రహాలనిచ్చాడు. లెక్కించ సాధ్యం కాన్ని వస్తువులున్నాయి. వాటిని వాడుతున్నాం. జీవితం గడుపుతున్నాం. ఆయన మేలు మరువలేం.

1. మేము ఆయన్నే అందరి సృష్టికర్త, పోషణకర్త, ఆరాధ్య దైవం, యజమానిగా గుర్తిస్తాం. ఆయనే అందరి ప్రభువుగా ఆమోదిస్తాం. ఆయన పనిలోగాని, అధికారంలోగాని, ఆయన మాటలోగాని, సుగుణ సముదాయంలో గాని ఇతరుల్ని సమానులుగా చేయము.
2. ఆయన ఇచ్చిన అనుగ్రహాలకు కృతజ్ఞత తెలుపుకుంటూ నమాజు చేస్తాం. స్తుతి చేస్తాం కూడ. ఆయన్నే మన ఆరాధ్య దైవంగా చేసికొని ఆయనకే సాష్టాంగప్రణామం చేస్తాం. ఆయన తప్ప ఇతరులెవ్వరు దాస్యానికి అర్హులు కారని, పూజా పురస్కారాలకు తగరని విశ్వసిస్తాం.
3. అందరికంటే అమితంగా అల్లాహ్‌ను ప్రేమిస్తాం. ఏ పనులు చేస్తే ఆయన సంతుష్టి అవుతాడో ఆ పనులనే చేస్తాం. ఏ పనులంటే అల్లాహ్‌కు అయిష్టమో వాటి నుండి తప్పుకొంటాం. ఏదైనా పొరబాటు జరిగితే అల్లాహ్‌కు ప్రాధేయ పడి క్షమాపణ వేడుకొంటాం. ఇక ముందు తప్పు చేయకుండా జాగ్రత్తపడుతాం.
4. మా స్నేహం, శత్రుత్వం, సహాయం చెయ్యడం, చేయి ఆపుకోవడం కేవలం అల్లాహ్ కోసమే, అందులో మరే స్వార్థం ఉండదు.

## 2. ప్రియ ప్రవక్తకు మనపై ఉన్న హక్కు

అల్లాహ్‌కు మనపై ఉన్న హక్కుల తరువాత మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం)కు మనపై ఎన్నో హక్కులున్నాయి. ఆయనే (సఅసం) మనకు దైవ అభీష్టమంటే ఏమిటో తెలిపారు. అల్లాహ్ ఆజ్ఞలపై

నడుచుకొనే విధానం తెలిపారు. దివ్యగ్రంథం ఖుర్‌ఆన్‌ను తెచ్చారు. ఇస్లాం మహాభాగ్యం ప్రసాదించారు. జీవితం గడిపే ఋజుమార్గం, సత్యమార్గం మనకు చూపించారు. మనందరి యోగక్షేమాల కోసం ఎన్నో కష్టాలనుభవించారు. ఆయనే (సఅసం) గనక ప్రపంచంలో రానున్నట్లయితే మన గతి ఏమై ఉండేదో. గమ్యం తెలియని వారమై అటు ఇటు తచ్చాడుతూ తిరిగేవారం. చక్కటి మార్గం కోల్పోయి అంధకారంలో ప్రాకులాడే వారం, ఇతరులను కష్టాలపాలు చేసేవారం. స్వయంగా దుష్టులయ్యేవారం. ప్రపంచంలో నష్టపొయ్యేవారం. పరలోకంలో నరకశిక్ష అనుభవించేవారం. మహాప్రవక్త చూపిన శ్రేయస్కర మార్గం వల్ల ఇహపరాలలో విజయోన్ముఖులయ్యాం. అందుచేత ఆయనకు (సఅసం) మనమెంతో ఋణపడ్డాం.

## మన ప్రియప్రవక్త (స)కు మనపై ఉన్న హక్కులు

1. మనం ఆయన (సఅసం)ను హృదయపూర్వకంగా గౌరవించాలి. ఆయన పేరు వినగానే దరూద్, సలాం ప్రార్థన చెయ్యాలి.

**"అల్లాహుమ్మ సల్లి అలా సయ్యిదినా వ మౌలానా ముహమ్మదిన్ వ అలా ఆలి సయ్యిదినా వ మౌలానా ముహమ్మదిన్ వ బారిక్ వసల్లమ్"**

2. ఆయన (సఅసం) ప్రబోధనల్ని ఆలకించి పాటించాలి. ఆయన్నే మన జీవితంలో ఆదర్శంగా తీసుకోవాలి.

3. తల్లిదండ్రుల కంటే ఆయన (సఅసం)ను ఎక్కువగా ప్రేమించాలి. ఆయన మిత్రుల్ని మన మిత్రులుగా, ఆయన శత్రువుల్ని మన శత్రువులుగా పరిగణించాలి.

## 3. తల్లిదండ్రులకు మనపై ఉన్న హక్కులు

1. అల్లాహ్, ఆయన ప్రవక్త (సఅసం) తరువాత తల్లిదండ్రులకు మనపై హక్కులున్నాయి. తల్లిదండ్రులకు మనమెంతో ఋణపడ్డాం. తల్లి మనలను నవ మాసములు గర్భంలో మోసింది. అనేక బాధలకోర్చి మనకు జనన మిచ్చింది. శైశవంలో నిర్బలులుగా ఉండేవారం. ఆమె ప్రేమతో పెంచింది. రేయిం బవళ్లు ఓర్పుతో సహనంతో మనలను గారాబంగా చూచింది. మనకు ఏది తెలిసింది కాదు. ఆమె మనకు మాటలు నేర్పింది. మోసుకొని ఎన్నో మాసాలు తిరిగింది. కమ్మని పాలిచ్చి బాల్యంలో పోషించింది. మనకు ఏ కొద్ది జబ్బు వచ్చినా ఆమె తల్లిడిల్లిపోయేది. అమ్మ ప్రేమ అమూల్యం.

నాన్న గారికి కూడా మేము ఋణపడ్డాం. మనల్ని పెంచి పోషించడంలో ఆయన పాత్ర కూడా విశిష్టమైంది. శ్రమించి ఆర్జించాడు. ఆ సొమ్ముతోనే మనల్ని పెంచాడు. మంచి మంచి వస్తువుల నిచ్చాడు. ధరించేందుకు దుస్తులు తెచ్చిపెట్టాడు. మిఠాయిలు తెచ్చాడు. పండ్లు ఫలాలనిచ్చాడు. ఆడుకోవటానికి బొమ్మలు కొనిపెట్టాడు. మన బాగు కోసం ఎన్నో ప్రయత్నాలు చేశాడు. చదివించాడు. ప్రపంచంలో పేరు ప్రతిష్ఠలు సంపాదించే యోగ్యుణ్ణి చేశాడు. తండ్రిని మించిన ఘనుడు కావాలని కోరాడు.

**తల్లిదండ్రులకు మనపై ఉన్న హక్కులు**

1. తల్లిదండ్రుల పట్ల నిండు గౌరవం చూపాలి. ప్రేమతో చూచుకోవాలి. వారికి కష్టం కలిగించే మాటగాని పనిగాని చెయ్యరాదు.
2. వారి మాటల్ని సంతోషంగా వినాలి. చెప్పినట్లు చెయ్యాలి. రేయింబవళ్లు వారి సేవ చేయడానికి సంసిద్ధులై ఉండాలి.
3. తల్లిదండ్రుల కోసం కారుణ్యం ప్రసాదించమని అల్లాహ్‌ను అర్థించాలి.

**రబ్బిర్‌హమ్‌హుమా కమారబ్బయానిసగీరా.**

**4. గురువు గారికి మనపై ఉన్న హక్కులు**

మనకు గురువులు ఆధ్యాత్మిక తండ్రి వంటి వారు. వారి స్థానం తండ్రితో సమానం. మేము నిరక్షరాస్యులముగా ఉన్నాం. గురువు మనకు విద్యాబుద్ధులు నేర్పారు. ఇస్లాం జీవిత మార్గం తెలిపారు. అల్లాహ్, మహాప్రవక్త (సఅసం) మనల నుండి కోరేదేమిటో విశదీకరించి తెలిపారు. ఉపాయంతో మనలను సుశిక్షితులుగా చేశారు. గురు ప్రబోధన లేకుంటే మనము అజ్ఞానులుగా ఉండేవారం. దైవధర్మం అంటే ఏమిటో తెలియని వారిగ ఉండేవారం.

**మనపై గురువుగారి హక్కులు**

1. నిండు గౌరవంతో వారి పట్ల మెలగాలి. మర్యాదతో వారి పేరు ప్రస్తావించాలి. ప్రేమ ఉట్టి పడేట్లు వారితో పలుకరించాలి.
2. గురువుగారి మాట వినాలి.
3. అన్ని విధాల వారి సేవ చేయాలి.

5. మనపై అన్న దమ్ముల, అక్కచెల్లెళ్ల హక్కులు

సోదరులకు కూడా మనపై హక్కులున్నాయి. ఒకే ఇంటిలో సోదరులతోపాటు తింటూ, తాగుతూ, ఆడుతూపాడుతూ కలిసిమెలసి ఉన్నాం. అన్నలు, అక్కలు మనల్ని గారాబంతో చూశారు. వారికి దొరికిన తిను బండారాలలో మనకు భాగం ఇచ్చారు. దెబ్బలు గాయాలు తగలకుండా కాపాడారు. ప్రేమతో మనల్ని ఓదార్చారు. తమ్ముళ్ళ చెల్లెళ్ళ ముద్దు ముఖాలు మనలను ముగ్ధపరిచాయి. మనకు కావలసిన సంతోషాన్నిచ్చాయి. వారి ముచ్చట్లు ముదావహాన్నిచ్చాయి. వారిందరికి మన హృదయాల్లో ఓ స్థానం ఉంది. పెద్దన్న గారు తండ్రితో సమాన ఔన్నత్యం కలవారు పెద్ద అక్కయ్య గారు తల్లితో సమానులు

## మనపై తమ్ముళ్ళు చెల్లెళ్ళ హక్కులు

1. ఆప్యాయంగా వారిని పలుకరించాలి.
2. వారు పొరబాటున చేసిన తప్పులను మన్నించాలి. వారి అవివేకం వల్ల ఏదైనా నష్టం కలిగితే వారిని వేధించడం కంటే ప్రేమతో నచ్చజెప్పాలి.
3. తినుబండారాలు, షరబతులు, ఇంకేవైనా వినోద వస్తువులంటే వారితో పంచుకోవాలి.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి**

1. అల్లాహ్‌కు మనపై ఉన్న హక్కులు ఏమిటి?
2. అల్లాహ్ మనకు ప్రసాదించిన అనుగ్రహాలకు గాను ఎలా కృతజ్ఞతలు తెలుపుకోవాలి?
3. అల్లాహ్ తరువాత ప్రవక్త (స) హక్కులు మనపై ఎక్కువగా ఎందుకు ఉన్నాయి?
4. తల్లిదండ్రులకు మనపై ఉన్న హక్కులు ఏమిటి?
5. తండ్రికి సమానంగా గురువు స్థానం ఉండడానికి కారణమేమిటి?
6. మీరు మీ తమ్ముడు చెల్లెళ్లతో ఎలా వ్యవహరిస్తారు?

**(ఆ) మనపై ఇతరుల కొన్ని హక్కులు ఉన్నాయి. అయితే ఈ క్రింది వాక్యాలను శ్రద్ధగా చదివి ఏవరి హక్కులు ఏవో బ్రాకెట్లలో వ్రాయండి.**

1. అందరికంటే అమితంగా అల్లాహ్‌ను ప్రేమిస్తం. ఏ పనులు చేస్తే ఆయన సంతుష్టి అవుతాడో ఆ పనులనే చేస్తాం. (        )
2. వారి మాటల్ని సంతోషంగా వినాలి. వారు చెప్పినట్లు చేయాలి. రేయింబవల్లు వారి సేవ చేయడానికి సంసిద్ధులై ఉండాలి. (        )
3. ఆయన (స) ప్రబోధనల్ని ఆలకించి పాటించాలి. ఆయన్నే మన జీవితంలో ఆదర్శంగా తీసుకోవాలి. (        )
4. గురువు గారి మాట వినాలి (        )
5. తినుబండారాలు, షరబతులు, ఇంకేమైనా వినోద వస్తువులుంటే వారితో పంచుకోవాలి. (        )

**(ఇ) ఈ క్రింది ఖాళీలను పూరించండి.**

1. అల్లాహ్ మనల్ని సృష్టించాడు. మంచి................ఇచ్చాడు.
2. ..............లో మిన్న అయిన మానవుల్లో జన్మింపజేశాడు.
3. ప్రపంచంలో తన...............................జేశాడు.
4. ముస్లిముల కుటుంబంలో జననమిచ్చి .........................విధానాన్ని పాటించడానికి సులభసాధ్యం చేశాడు.

5. ..........................హక్కులు మనపై ఎక్కువగా ఉన్నాయి. తల్లిదండ్రులకంటే ఆయన్ను ఎక్కువగా ప్రేమించాలి.
6. తల్లి మనలకు రేయింబవళ్లు ఓర్పుతో సహనంతో మనలను..............................చూచింది.
7. మనకు గురువులు.........................తండ్రి వంటి వారు.
8. అన్నయ్య తండ్రితో సమానం. అక్కయ్య..............................తో సమానం.

## చేయాల్సిన మరి కొన్ని పనులు

తల్లి దండ్రులకు సంబంధించి ఈ పాఠంలో నేర్పిన దుఆను కంఠస్తం చేయండి. దాని అనువాదం ఇది : ఓ మా ప్రభూ! వారిద్దరిని కరుణించు. ఏవిధంగానయితే వారు మమ్మల్ని మా బాల్యంలో పెంచిపోషించారో'. తల్లిదండ్రుల విషయంలో ఎల్లప్పుడూ ఈ దుఆ చేస్తుండాలి.



# 16. అమ్మానాన్నలు

ముద్దుగ అమ్మానాన్నలు నన్ను మేల్కొలిపారు
ముఖం కడిగారు, అల్పాహారం ఇచ్చారు
వలదు వలదని గొడవ చేశాను,
కాని లాలించారు
కౌగిలించుకొన్నారు,
బుజ్జగించారు
ఒడిలో కూర్చోబెట్టుకొన్నారు
ప్రేమతో పలుకరించారు
వారు చూపిన కరుణకు ముగ్ధుడనయ్యాను నేను
మానుకొన్నాను అల్లరి చేయడం నేను
ఇక మనసారా మాతాపితల సేవ చేస్తాను నేను

ఉన్నాయి స్మరణలో అనారోగ్యంతో బాధపడిన రోజులు
ఆవేదనతో గడిపాను పగళ్ళు, నిద్ర కోల్పోయాను రాత్రిళ్ళు
పడక మీద పడ్డాను, ఏడుస్తూ గడిపాను అర్ధరాత్రులు
తండ్రి గారి సుఖం దూరపరిచాను
అమ్మగారి నిద్ర భంగపరిచాను
సాధ్యమైనంత సుఖం కలుగజేస్తాను నేను
ఇక మనసార మాతాపితల సేవ చేస్తాను నేను

ఉదయం నుంచి పని చేసి రాత్రి ఇంటికొచ్చారు నాన్న
చెమటోడ్చి సంపాదించి అంతా ఇచ్చేశారు నాన్న
ఆయన కష్టఫలితమే నా సుఖసౌఖ్యాల అదృష్టం
ఆయనిచ్చిన భాగ్యం మరువలేని నా ఆనందం
సాధ్యమైనంత ఆర్జించి ఇస్తాను వారికే నేను
ఇక మనసారా మాతాపితల సేవ చేస్తాను నేను
కావాలి నాకు వారి ఆశీస్సులు
ఆలకించు ప్రభూ నా ప్రార్థనలు
మరువలేను ఎన్నటికీ నేను వారి మక్కువ
పొందాను వారి చేతుల నుండి ఎంతో ఎక్కువ
సంపాదించి అంతా ఇస్తాను వారికే నేను
ఇక మనసారా మాతాపితల సేవ చేస్తాను నేను

# 17. ప్రియ ప్రవక్త (స) ఎలా ఉండేవారు?

మన ప్రియ ప్రవక్త ముహమ్మద్ (స) విశ్వనాయకుడు. ప్రవర్తనలో అందరికన్నా మిన్న. ఆయన పలుకులు రత్నాల్లాంటివి. ఆయన పనులన్నీ చక్కగా ఉండేవి. ఆయన జీవితం ఇహపరాల శ్రేయంతో నిండివుంది. శ్లాఘించడానికి ఏ గుణమని చెప్పాలి? చిన్న నోట పెద్ద మాటవుతుంది.

ఆయన్ను గురించి స్వయంగా అల్లాహ్ దివ్యఖుర్ఆన్‌లో చెప్పాడు. హ్రజత్ ఆయెషా (రజి) మహా ప్రవక్త (సఅసం) సతీమణి. ఒకాయన ఆమెను ఇలా అడిగారు. ఏమండి మన ప్రియప్రవక్త (సఅసం) ఎలా ఉండేవారు. "ఆయన (సఅసం) ఖుర్ఆన్ బోధనలకు ప్రతీకగా ఉన్నారు" అని ఆమె సమాధానమిచ్చారు. అంటే దివ్యఖుర్ఆన్‌లో చెప్పబడిన సుగుణాలన్నీ ఆయనలో మూర్తీభవించి ఉన్నాయి అని అర్థం.

ఆయన (సఅసం) ఎప్పుడు పరిశుభ్రంగా ఉండేవారు. అపరిశుభ్రత అంటే ఆయనకు (సఅసం)నచ్చేది కాదు. పరిశుభ్రత విశ్వాసంలో సగభాగం అని చెప్పారు. స్నానం చేసేవారు. మలిన రహిత దుస్తులు వేసికొనే వారు. పళ్ళు బాగుగా తోముకొనేవారు. పరిమళాలు ఉపయోగించేవారు. అత్తరు అంటే అభిలాష ఎక్కువ. తల దువ్వుకొనేవారు. కంటికి సుర్మా పెట్టుకొనేవారు. సంతోషంగా భోజనం చేసేవారు. భోజనం బాగాలేదని చెప్పేవారు కారు. భోజనాన్ని ముందు భాగం నుండి తిని ప్రారంభించే వారు. అక్కడ ఇక్కడ చేతులు పెట్టే వారు కారు. భోజనం చేసే సమయంలో సపోర్టు తీసుకొని భుజించే వారు కారు. ఆకలి కలిగిందని అమితంగా తినేవారు కారు. భోజనానంతరం వెంటనే నిద్రించేవారు కారు. ఆకలి తీరాక మరేమీ పుచ్చుకొనేవారు కారు. అలా తినడం మానండి అనేవారు. పొట్ట వ్యాధులకు పుట్ట అనే వారు. తన పనులు తానే చేసికొనేవారు. ఇతరులను కష్టపెట్టే వారు కారు. పైగా ఇతరులకే పనులు చేసిపెట్టేవారు. పశువులకు మేత వేసేవారు. వాటిని శ్రద్ధతో చూచుకొనేవారు. పాలు పితికేవారు. కసువు ఊడ్చేవారు. పిండిని కలిపేవారు. బట్టలు ఉతుక్కునేవారు. బజారుకెళ్ళి సామానులు తెచ్చుకొనేవారు. చెప్పులు కుట్టుకునేవారు. ఇల్లు మరమ్మతు చేసుకొనేవారు. వృధాగా సమయం గడిపే వారు కారు. ఎప్పుడు పని చేస్తుండేవారు. అన్ని పనులు చేసేవారు. ఇతరులతో పని చేయించుకోవడానికి ఆయన (సఅసం) ఇష్టపడేవారు కారు.

మహాప్రవక్త (సఅసం) వయస్సు మీరిన పెద్దవారిని గౌరవించేవారు. ఒకప్పుడు తన శైశవంలో పాలిచ్చిన దాయి, హలీమ, వచ్చారు. ఆమెను ఆదరించి సత్కరించారు మన ప్రియ ప్రవక్త (సఅసం). ఆమె కూర్చోడానికి తన దుప్పటి తీసి క్రిందపరిచారు. మరోసారి జరిగిన విషయం. మహాప్రవక్త (సఅసం) కూర్చుని వున్నారు. దాయి హలీమ పెనిమిటి వచ్చారు. మహాప్రవక్త (సఅసం) తన దుప్పటి ఒక భాగం పరిచి ఆయన్ను కూర్చోబెట్టారు. ఇంతలోనే హలీమా గారు వచ్చారు. దుప్పటి రెండవ భాగం పరిచి ఆమెను కూర్చోబెట్టారు. హలీమ కుమారుడు కూడా రానే వచ్చారు. మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) లేచి ఆదరణలో ఆయన్ను తన ముందు కూర్చోబెట్టారు.

పసి పిల్లలంటే ముద్దు మన ప్రియప్రవక్త (సఅసం)కు. పిల్లవాండ్లకు కూడా ఆయన (సఅసం) అంటే ఎంతో ప్రేమ. బజారులో వీధుల్లో మహాప్రవక్త (సఅసం) కంటపడ్డారంటే చాలు అమితానందంతో గంతులేస్తూ పరుగిడుకొంటూ దగ్గరకు వచ్చేవారు బాలబాలికలు. మహాప్రవక్త (సఅసం) తో కలిసేవారు. మహాప్రవక్త (సఅసం) అందరికి సలాం చేసేవారు, పసిపిల్లల్ని ఒడిలో ఎత్తుకొనేవారు. ముద్దాడి వారి కోసం ప్రార్థనలు చేసేవారు. మహాప్రవక్త (సఅసం) పసి పిల్లల్ని ఎన్నడు దండించలేదు. పసిపిల్లల్ని కొట్టకుండా ఇతరుల్ని కూడా వారించేవారు.

బాలబాలికలు తమ తల్లిదండ్రులకంటే ఎక్కువ గౌరవంతో ప్రియ ప్రవక్త (సఅసం)ను చూచు కొనేవారు. మనము కూడా మహాప్రవక్త (సఅసం)ను యావత్తు ప్రపంచంకంటే విలువైన వ్యక్తిగా తలుస్తాం. ఆయన (సఅసం) చెప్పిన ఏ మాటైనా సరే వినగానే అంగీకరిస్తాం. దాని ప్రకారం నడచుకొంటాం. ఆయన (సఅసం) పేరు వినగానే దరూద్ మరియు సలాము పఠిస్తాం.

**అల్లాహుమ్మ సల్లి అలాముహమ్మదిన్ వ అలా ఆలి ముహమ్మదిన్ బారిక్ వసల్లిమ్.**

అందరికి ధర్మప్రబోధనం చేసేవారు ప్రియప్రవక్త
ఆణి ముత్యాల్లాంటి మాటలు పలికేవారు ప్రియప్రవక్త
నిస్సహాయుల కోసం నిర్బలుల కోసం ప్రియప్రవక్త
మోసే వారు దుఃఖ భారం ఎప్పుడు
దారితప్పి మోస పోయ్యాం
మోక్షమార్గం తెలియక ఉన్నాం
అప్పుడే చక్కటి మార్గం చూపించారు ప్రియప్రవక్త
శ్రేయస్కర మార్గం పాటించమన్నారు ప్రియప్రవక్త
మధుర మాటల్లో అల్లాహ్ ఆజ్ఞల్ని వినిపించారు ప్రియప్రవక్త
ప్రతి ఒక్కరిని ప్రళయం గురించి హెచ్చరించారు ప్రియప్రవక్త
మిత్రుల్ని శత్రువుల్ని చూచారు ప్రియప్రవక్త
అందరికీ సహాయపడ్డారు ప్రియప్రవక్త
దుఃఖించలేదు ఎక్కడ ప్రియప్రవక్త
ఇది నిత్యసత్యం ఓ మహాశయ తెలుసుకో!
ఎవరిని బాధించలేదు ప్రియప్రవక్త గుర్తించుకో!

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి**

1. 'ప్రియ ప్రవక్త (స) ఎలా ఉండేవారు?' దీనికి సమాధానంగా ఆయన (స) సతీమణి హ్రజత్ ఆయిషా (రజి) ఏమన్నారు?
2. పరిశుభ్రంగా ఉండడానికి ఆయన (స) ఏం చేసే వారు?
3. భోజన సమయంలో ఆయన (స) ఎలాంటి నియమాలు పాటించేవారు?
4. ఆయన (స) పెద్దలతో ఎలా మసలుకునేవారు?
5. ఆయన (స) స్వయంగా ఏఏ పనులు చేసుకునేవారు?
6. ప్రియప్రవక్త (స) పిల్లలతో ఎలా ఉండేవారు?
7. మీరు ఈ ప్రపంచంలో ఎవరిని అమితంగా ఇష్టపడతారు?

**(ఆ) ఈ క్రింది ఖాళీలను పూరించండి.**

1. ......................అంటే ఆయనకు నచ్చేది కాదు.
2. ........................విశ్వాసంలో సగభాగం అని చెప్పారు.
3. ఇతరులతో.........................చేయించుకోవడానికి ఆయన ఇష్టపడేవారు కాదు.
4. ప్రవక్త (స) బాల్యంలో ............................పాలిచ్చారు.
5. పిల్లల్ని కొట్టకుండా ఇతరుల్ని కూడా...................................

## చేయాల్సిన మరి కొన్ని పనులు

ప్రవక్త (స)కు ఇష్టంలేని విషయాలు ఏమిటో తెలుపండి?

# 18. ప్రియప్రవక్త (స) పలికిన ఆణిముత్యాలు

ప్రియప్రవక్త (స) పలికిన సూక్తులు మనకెంతో ఉపయోగపడతాయి. మనం వాటిని శ్రద్ధగా వింటాం, పఠిస్తాం, జ్ఞాపకం చేసుకుంటాం, వాటిపై నడవడానికి పూర్తి ప్రయత్నం చేస్తాం. కొన్నిటిని మీరు కూడా వినండి:

1. పిల్లలు స్వర్గలోక పుష్పాలు.
2. ఏ ఇంట్లో పిల్లలు ఉండరో ఆ ఇంట్లో శుభం ఉండదు.
3. విద్యార్జన ప్రతి స్త్రీ పురుషునిపై తప్పనిసరి విధి అవుతుంది.
4. ఒడి నుండి గోరి వరకు విద్యనభ్యసిస్తూ ఉండండి.
5. విద్యాబోధన చేసిన గురువును గౌరవించండి.
6. అజ్ఞానిని మించిన దౌర్భాగ్యుడు మరొకడు లేడు. విద్యను మించిన విత్తము వేరొకటి లేదు.
7. పెద్దల పట్ల గౌరవం, పిన్నల పట్ల ప్రేమ లేని వారు మాలోని వారు కారు.
8. స్వర్గం తల్లిపాదాల క్రింద ఉంది.
9. అల్లాహ్ ప్రసన్నత తండ్రి సంతోషంలో ఉంది, అల్లాహ్ ఆగ్రహం, తండ్రి ఆగ్రహంలో ఉంది.
10. తల్లిదండ్రులను తిట్టడం లేదా వారి పట్ల చెడు పలుకడం పాపమవుతుంది. ఇతర పిల్లలను, వారి తల్లిదండ్రులను తిట్టడం, వారి పట్ల చెడుగా ప్రవర్తించడం కూడా అంతే.
11. పెద్ద అన్నయ్యగారి స్థానం తండ్రితో సమానం.
12. బిస్మిల్లాహ్ అని తినడం మొదలెట్టండి. ప్రారంభంలో అనడం మరిచిపోతే మధ్యలోనైన, చివరలోనైనా సరే (బిస్మిల్లాహ్) అని అనండి.
13. బజారులో తినడం అల్పతనం.
14. రోగి ఎదుట కూర్చొని తినకండి.
15. నీకోసం నీవు ఏది ఇష్టపడతావో అదే ఇతరుల కోసం కూడా కోరుకో.
16. చెడు సహవాసాన్నాశ్రయించి ఉండడం కన్నా ఒంటరిగా ఉండడం మంచిది.
17. పరస్పరం సలాం చేయండి. దీనివల్ల ప్రేమ, వాత్సల్యం అధికమవుతుంది.
18. చిన్నవారు పెద్దలకు, నడిచే వ్యక్తి కూర్చున్న వ్యక్తికి, చిన్న సముదాయం వారు పెద్ద సముదాయానికి సలాము చెయ్యాలి.
19. (దానం) ఇచ్చి మళ్లీ తీసుకొనేవాడు కక్కి నాకే కుక్కలాంటి వాడు.
20. అబద్ధం మనిషి ముఖవర్చస్సును తొలగిస్తుంది.

21. సత్యం పలుకండి, దాని వల్ల మీకు నష్టం కలిగినా సరే.
22. పరుల ఆపద చూసి పరిహసించకు. ఆ ఆపద నీపైకూడా పడవచ్చు.
23. అంధునికి తప్పుతోవ చూపించే వానికి వినాశం తప్పదు.
24. చాడీలు చెప్పే వానికి స్వర్గప్రవేశంలేదు.
25. ఎవరయితే ఒక పక్షిని వేళాకోళంగా చంపుతాడో ప్రళయ దినాన ఆ పక్షి హంతకునికి వ్యతిరేకంగా ఫిర్యాదు చేస్తుంది.
26. వేళకు సరిగా నమాజు చేయండి.
27. నమాజుల్లో మీ మీ వరుసల్ని సరిచేసుకోండి.
28. నమాజుల్లో క్రీకంటితో చూడడం చెడును తెచ్చిపెట్టుతుంది.
29. (సామూహిక నమాజుల్లో) రుకూ లేదా సజ్దా చేసే సమయంలో ఇమాం కంటే ముందు తలను పైకి ఎత్తేవాని తలను అల్లాహ్ గార్ధభ శిరస్సుగా మారుస్తాడేమో.(జాగ్రత్త పడండి)
30. చెప్పండి నేను విశ్వాసవంతుణ్ణయ్యాను, మరి దానిపైనే దృఢంగా నిలిచాను.
31. నేను చివరి ప్రవక్త(స)ను. నా తరువాత మరో ప్రవక్త పుట్టబోడు. నాకు నా ప్రభువు తొమ్మిది విషయాలు ఆజ్ఞాపించాడు.
32. బహిరంగంగా, గుప్తంగా నేను అల్లాహకు భయపడుతూ ఉండాలి.
33. ఎవరిపట్లనైనా సరే, నేను సంతోషంగా ఉన్నా, అసంతృప్తిగా ఉన్నా, అన్ని పరిస్థితుల్లో నేను న్యాయమైన మాటనే పలుకాలి.
34. కలిమిలేముల ఏ పరిస్థితిలోను హద్దుమీరి ప్రవర్తించరాదు.
35. ఎవరయితే నాతో తెగతెంపులు చేసుకొంటారో వారితో నేను కలిసి ఉండాలి.
36. నాకు ఎవరు ఇవ్వ నిరాకరిస్తారో వారికి నేను ఇవ్వాలి.
37. నాపై ఎవరు దౌర్జన్యం చేస్తారో వారికి నేను క్షమాభిక్ష పెట్టాలి.
38. ఊరికే కూర్చుంటే కూడా ఆలోచిస్తూ ఉండాలి.
39. మాట్లాడితే అల్లాహ్ పలుకులే పలకాలి.
40. ఏదైనా చూచినట్లయితే దాన్నుండి గుణపాఠం నేర్చుకోవాలి. (సాధారణంగా) మంచిని చెయ్యమని ఆజ్ఞాపించాలి.

ఈ ఆణిముత్యాలు మన వరకు చేర్చడంలో ఆయన ఉద్దేశ్యం మనం కూడా ఈ ఆజ్ఞల్ని ఇతరుల ´కకు చేర్చాలి.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వండి?**

1. ప్రియ ప్రవక్త (స) ప్రియమైన సూక్తులు ఎందుకు వినిపిస్తారు?
2. ఇతరుల తల్లిదండ్రులను తిట్టడం మన తల్లిదండ్రులను తిట్టడానికి సమానం ఎందుకు?
3. సలామ్ ప్రయోజనాలు, నియమాలు ఏమిటి?
4. పక్షుల్ని చంపకుండా ఆయన (స) ఎందుకు వారించారు?
5. ఎవరైనా ఆపదలో ఉండడాన్ని చూసి ఆనందించకూడదని ఆయన (స) ఎందుకన్నారు?

**(ఆ) ఈ క్రింది పదాలను ఉపయోగించి ప్రవక్త (స) సూక్తులు తెలిపే విధంగా వాక్యాలు వ్రాయండి.**

ఉదాహరణకు : బజారులో తినడం అల్పతనం.

అల్పతనం, సత్యం, అబద్ధం, చాడీలు, ఇష్టం

**(ఇ) ఈ క్రింది వాక్యాలను శ్రద్ధగా చదివి వాటి ముందు ఉన్న బ్రాకెట్లలో అవి తప్పు అయితే ( X ) అని, ఒప్పు అయితే (✓) అని గుర్తులు వేయండి.**

1. తల్లి పాదాల క్రింద స్వర్గం ఉంది ( )
2. పిల్లలు ఇంటికి పుష్పాలు ( )
3. అంధునికి తప్పుతోవ చూపించే వానికి వినాశం తప్పదు ( )
4. నమాజుల్లో మీ మీ వరుసల్ని సరిచేసుకోండి. ( )
5. ఎవరయితే నాతో తెగతెంపులు చేసుకుంటారో వారితో నేను తెగతెంపులు చేసుకుంటాను( )

**(ఈ) ఈ క్రింది ఖాళీలను పూరించండి.**

1. ఒడి నుంచి............................వరకు విద్యనభ్యసిస్తూ ఉండండి.
2. విద్యా బోధన చేసిన....................గౌరవించండి.
3. ....................ఎదుట కూర్చుని తినకండి.
4. నాపై దౌర్జన్య చేసిన వారికి నేను........... పెట్టాలి.
5. ఏదైనా చూసినట్లయితే దాన్నుండి.................................నేర్చుకోవాలి.

## చేయాల్సిన మరి కొన్ని పనులు

ప్రవక్త (స) గారి ఈ ప్రియమైన సూక్తులను కంఠస్తం చేసుకోని వినిపించండి. వీటిని ఇతరుల వరకుచేర్చండి.

# 19. దైవ మార్గంలో వేధింపులు

ఇస్లాం సత్యధర్మం. దీనిని పాటించడంలోనే అందరి ముక్తి ఉంది. ఇహపరాల బాగోగులు ఇస్లాం ప్రకారం జీవితం గడపడంలోనే ఉన్నాయి. ఎవరయితే ఇస్లాం మార్గాన్ని కాదని జీవితం గడుపుతారో వారు స్వయంగా మంచి మార్గం తప్పిన వారవుతారు, ఇతరులను కూడా మార్గభ్రష్టులుగా చేస్తారు. మార్గం తప్పి తాము చెడడమే కాకుండా, అన్ని వైపుల ఆందోళనలు సృష్టిస్తూ ప్రజాజీవితాన్ని స్థంభింపజేస్తారు, ప్రజల్ని దుఃఖపరుస్తారు. వారికి ప్రాపంచిక జీవితంలోను నష్టం ఉంటుంది, పరలోకంలో దుర్భర శిక్ష వారి కోసం ఉంటుంది.

ఇహలోకంలో ప్రజలను వినాశం నుండి రక్షించడానికోసం, పరలోకంలో నరక యాతన నుండి కాపాడడానికి మన ప్రియప్రవక్త (సఅసం) వచ్చారు. ప్రజలకు ఇస్లాం తెలిపే చక్కటి, సత్య మార్గాన్ని చూపించారు. మంచి వారు ఆయన (సఅసం) మాటను విన్నారు. ఆయన ననుసరిస్తూ జీవితం గడిపారు. కాని మూర్ఖులు తమ మౌఢ్యాన్ని వదలలేదు. అయినప్పటికి మహాప్రవక్త (సఅసం) వారి శ్రేయాన్ని అభిలషించారు. వారు మాత్రం ఆయన (సఅసం)కు బద్ధ శత్రువులయ్యారు. మొదట ముహమ్మద్ (సఅసం)ను బెదిరించారు, శిక్షిస్తామని భయపెట్టారు, ఆ తరువాత ప్రలోభం చూపించారు. అన్ని విధాలుగా విఫలులైన తరువాత ఆయన్ను వేధించడం మొదలెట్టారు. దారిన వెళ్ళుతుంటే దుండగులు పైబడి తగువు పెట్టుకొనేవారు. తిట్టేవారు, రాళ్ళు విసిరికొట్టేవారు. చెత్తాచెదారాలు పైన వేసేవారు, మల విసర్జనాలు ఆయన (సఅసం)పై చల్లేవారు. కలిగిన దుఃఖాన్ని ఆయన భరించారు. వారి శ్రేయాన్ని కోరుతూ కృషిచేసేవారు. జులుం చేయడం ఎందుకో వారు తెలుసుకోలేదు. వారి హితవు కోసం అల్లాహ్‌ను ప్రార్థించే వారు మహాప్రవక్త (స). కాని అవివేకులు తమ దుష్టపనులు పెంచుతూ పోయారు. మహాప్రవక్త (స) కుటుంబీకుల్ని సమాజం నుండి వెలివేశారు. అన్నం నీళ్ళు లేకుండా చేశారు. పసిపిల్లలు ఆకలితో అలమటించారు, పస్తులు గడిపారు. ఆకులు తింటూ జీవితం గడిపారు.

కొన్ని దినాలు గడిచాయి. మహాప్రవక్త (స) పినతండ్రి దివంగతులయ్యారు. ఆయన సతీమణి హజ్రత్ ఖదీజా (రజి) కూడా ఇహలోకం వీడిపోయారు. వీరిరువురు, మహాప్రవక్త (స)కు చేదోడు వాదోడుగా ఉండేవారు. అవిశ్వాసులకు వీరంటే భయముండేది. వీరిని దృష్టిలో పెట్టుకొనే ఏ పనికైనా పూనుకొనేవారు, వీరు ప్రపంచం వీడిన తరువాత ప్రవక్త (స) వైరులకు పట్టపగ్గాలు లేనట్టయ్యింది.

ఒకసారి జరిగిన విషయం. ముహమ్మద్ (స) కాబాలో నమాజు చేస్తు న్నారు. ఒక దుండగుడు దూరాన్నుండి చూచాడు. తన దుప్పటిని తాడులా చేశాడు. ముహమ్మద్ (స) ఆ సమయంలో సజ్దా చేస్తున్నాడు. తాటితో ఆయన(స) గొంతుకు ఉరిలా వేశాడు. గట్టిగా లాగడం మొదలెట్టాడు. అంతలో హజ్రత్ అబూబకర్ (రజి) అక్కడకు వచ్చారు. కాఫిర్లను గద్దించి మందలించారు. వారు అతణ్ణి కూడా కొట్టి వెళ్లిపోయారు.

కాఫిర్లకు నాయకుడు అబూ జహల్. అతడు ముహమ్మద్ (స)కు బద్ధశత్రువు. ముహమ్మద్ (స) నమాజు చేస్తుంటే వచ్చి పచ్చి పేడతో ఉన్న ఒంటె పొట్ట ప్రేవుల్ని తెప్పించాడు. ముహమ్మద్ (సఅసం) నెత్తిపై గుమ్మరించమన్నాడు. ఈ విషయం తన కూతురు హజ్రత్ బీబీ ఫాతిమా (రజి)కి తెలిసింది. పరుగిడు కుంటూ వచ్చిందామె. పేడతో నిండిన ఒంటె పొట్ట ప్రేవుల్ని తొలగించారు. దుర్వాసనతో నిండిన మలినాన్ని శుభ్రపరిచింది.

మక్కాకు కొంచెం దూరంలో ఒక పట్నం ఉండేది. ధర్మప్రబోధన కోసం మహాప్రవక్త (స) ఆ పట్నానికి – తాయిఫ్ వెళ్లారు. కాని అక్కడి ప్రజలు పాషాణ హృదయులు. మహాప్రవక్త (స) మాటల్ని వినలేదు. ఆయన్ను(స) నడిబజారులో నిలబెట్టి నిందించారు. రాళ్ళతో కొట్టి గాయపరిచారు. నానా దుర్భాషలాడారు. తుంటరి వెధవల్ని ఆయన (స) వెంట తగిలించారు. ఆయన్ను(స) తరిమిగొట్టారు. మహాప్రవక్త (స) దేహం గాయాలతో రక్తసిక్తమయింది. సహనంతో అన్నిటిని ఆయన (స) భరించారు. నోరు విప్పి శపించారు కాదు. ధర్మమెరుగని ప్రజలకు వెలుగుబాట చూపించమని ప్రభువును ప్రార్థించారు.

మహాప్రవక్త (సఅసం) అనుచరులను కూడా కాఫిర్లు హింసించేవారు. ఆ అనుచరులలో హజ్రత్ బిలాల్ (రజి) ఒకరు. ఆయన ఒక అవిశ్వాసి వద్ద బానిస. బానిస విశ్వాసవంతుడయ్యాడని ముహమ్మద్ (సఅసం)కు అనుచరుడయ్యాడని తెలియగానే ఆయన్ను వేధించడం మొదలెట్టాడు ఆ అవిశ్వాసి. ఎన్నో దినాలు పస్తు పెట్టాడు. కొట్టడం, తిట్టడం, మామూలయింది. నిండు వేసవిలో మండు ఎడారి ఇసుకలో పడేసి, పట్టుకుంటే చేయి కాలిపోయ్యే ఇనుప చువ్వను యదపై పెట్టాడు. మెడలో గొలుసులా తాడు వేసి అల్లరి మూకల చేతికిచ్చాడు. తుంటరివాళ్ళు అమాయకుడైన హజ్రత్ బిలాల్ (రజి)ను పట్టి రోడ్ల మీద లాగేవారు. ఇదంతా ప్రజలు తమాషాగా చూచేవారు. హజ్రత్ బిలాల్ (రజి) పల్లెత్తు మాట పలుకక బాధల్ని అల్లాహ్ మార్గంలో అనుభవించేవారు, సహించి మౌనం వహించేవారు.

మహాప్రవక్త (సఅసం) అనుచరులలో మరో వ్యక్తి హజ్రత్ ఖబ్బాబ్ (రజి) ముస్లిం అయ్యారు. కాఫిర్లు అతనిపై విరుచుకొని పడ్డారు. విపరీతంగ బాధలు పెట్టారు. ఒకనాడు దుష్టులు నిప్పులు పరిచివాటిపై హజ్రత్ ఖబ్బాబ్‌ను పరుండపెట్టారు. మొత్తం వీపు కాలిపోయింది.

హజ్రత్ యాసిర్ (రజి) మహాప్రవక్త (సఅసం) అనుచరులలోని వారు. అబూజహల్ అతనిపై కక్షసాధింపు చర్యలకు పూనుకొన్నాడు. అతని కుటుంబీకులపై చర్య తీసుకొన్నాడు. నానా హింసలకు గురిచేశాడు. చివరకు అతని సచ్ఛీల సతీమణిని శూలంతో పొడిచి చంపాడు. (ఇన్నాలిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్). అనేక మహాపురుషులు సత్యధర్మప్రచారంలో ఆపదలననుభవించారు. కాని ధర్మంపై నిలకడగా నిలిచారు. దాని ప్రచారం కూడా చేస్తూ వచ్చారు. దుఖం కలిగిన, నష్టం వాటిల్లిన ఖాతరు చేయకుండా ఇతరుల ఇహపరాల విజయం కోసం పాటుపడ్డారు. వారి తరువాత ఇక మన వంతు వచ్చింది. ఎన్ని ఇబ్బందులు కలిగినా మనం సత్యధర్మాన్నే ఆశ్రయించి ఇతరులకు ముక్తి మార్గం చూపించాలి. ఇదే మన ధ్యేయం కావాలి. అల్లాహ్ మనకు సహాయపడుగాక!

## అభ్యాసం

### (అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి

1. ప్రియప్రవక్త (స) ఈ ప్రపంచంలో ఎందుకు పంపించబడ్డారు?
2. దుష్టులు ప్రవక్త (స)ను ఏన్ని విధాలుగా వేధించారు?
3. ప్రియప్రవక్త (స) పిన తండ్రి అబూతాలిబ్, సతీమణి హ॥జత్ ఖదీజా (రజి) దివంగతులయిన తరువాత ఆయన (స)ను ఏవిధంగా వేధించారు?
4. తాయిఫ్ వారు ప్రవక్త (స)ను వేధించినప్పుడు ఆయన (స) ఏమన్నారు?
5. దుర్జనుల దౌర్జన్యాలకు గాను ప్రవక్త (స) అనుచరులపై ఎలాంటి ప్రభావం పడింది?

### (ఆ) ఈ క్రింద పేర్కొన్న ప్రవక్త (స) అనుచరుల గురించి మీకేం తెలుసో వ్రాయండి?

(1) హ॥జత్ బిలాల్ (రజి)

(2) హ॥జత్ ఖబ్బాబ్ (రజి)

3. హ॥జత్ యాసిర్ (రజి)

### (ఇ) ఈ క్రింది వాటిని జత పరచండి.

| | |
|---|---|
| 1. పేడతో నిండిన ఒంటె పొట్ట ప్రేవులు | 1. హ॥జత్ ఖబ్బాబ్ (రజి) |
| 2. మండుతున్న ఎడారి ఇసుక | 2. హ॥జత్ యాసిర్ (రజి) భార్య |
| 3. నిప్పుల పై పరుండబెట్టారు | 3. హ॥జత్ ముహమ్మద్ (స) |
| 4. శూలంతో పొడిచి చంపారు | 4. హ॥జత్ బిలాల్ (రజి) |
| 5. విపరీతంగా కొట్టడం | 5. హ॥జత్ అబూ బకర్ (రజి) |

### (ఈ) ఈ క్రింది ఖాళీలను పూరించండి.

1. ఇస్లామ్ సత్య ధర్మాన్ని పాటించడంలోనే అందరి ....................ఉంది.
2. మూర్ఖులు తమ.............................వదలలేదు.
3. మహా ప్రవక్త (స) కుటుంబీకుల్ని..................నుంచి వెలివేశారు.
4. .........................ఆయన (స)కు బద్ధ శత్రువు.

## చేయాల్సిన మరి కొన్ని పనులు

1. ఈ పాఠం నుంచి మీరు ఏం నేర్చుకున్నారో తరగతి గదిలో అందరి ముందు చెప్పండి.
2. ఈ పాఠంలో తెలిపిన ప్రవక్త (స) అనుచరుల గురించి, వారు ఇస్లామ్ స్వీకరించిన అల్లాహ్ మార్గంలో వేధింపబడిన సంఘటనలను మీ తల్లిదండ్రులు, మీ ఉపాధ్యాయులను అడిగి తెలుసుకోండి.

# 20. న్యాయవంతులైన ఖలీఫాలు

అల్లాహ్ అన్నిటిని చేశాడు. అన్నిటి సృష్టికర్త ఆయనే. ఆయనే అందరి అవసరాలను తీరుస్తాడు. ఆయన సామ్రాజ్యంలో ఈ భూగోళం ఒక చిన్న భాగం. భువిపై మనమందరం ఆయన ప్రతినిధులు. ఖలీఫా అంటే ఉప ప్రధాని లేక మానీటరు అని అర్థం. మాస్టరు గారు క్లాసుకు ప్రధానులు, అసలు బాధ్యత ఆయనదే. కొన్ని పనులు మానీటరుతో చేయించుకొంటుంటారు మాస్టరు గారు. ఇదే విధంగా ఈ విశ్వ సామ్రాజ్యానికి అసలు చక్రవర్తి అల్లాహ్ మాత్రమే. ఆయన సామ్రాజ్యాధిపత్యం అంత ఇంత అని మనం చెప్పలేము, ఊహించనూ లేము. ఆయన సామ్రాజ్యంలో భూమి ఒక చిన్న భాగం. ఈ భూమిలో మానవుణ్ణి అల్లాహ్ తన ప్రతినిధిగా నియమించాడు. ఈ భూభాగపు యాజమాన్యాధికారాలలో కొన్నిటిని మనకు అప్పగించాడు. ఈ భువిలో ఉన్నంత వరకు అల్లాహ్ అభీష్టాన్ని నెరవేర్చడమే మన పని.

మానవులందరు అల్లాహ్ నియమించిన ప్రతినిధులు, ఖలీఫాలు. కాని దేశ పాలనా భారాన్ని మోయడానికి, బాధ్యతలు నిర్వహించడానికి ఒక సర్దారు కావాలి. ముస్లిములు ఈ బాధ్యతలు నిర్వహించడానికి ఎవరిని సర్దారుగా చేస్తారో. ఆయన 'ఖలీఫా' అనబడతాడు. ఖలీఫా దైవాజ్ఞల ప్రకారం ప్రాపంచిక వ్యవహారాలు నడుపుతాడు. అందరిని అల్లాహ్ ఇష్టప్రకారం జీవితం గడుపమని ఆదేశిస్తాడు. మహాప్రవక్త (సఅసం) తరువాత ఈ భూమిపై సరిగ్గా అల్లాహ్ ఆజ్ఞల ననుసరించి పరిపాలనా బాధ్యతలు నిర్వహించే వారిని "ఖులఫా-యె-రాషిదీన్" లేదా 'చక్కటి ఖలీఫాలు' అని అంటారు. హజ్రత్ అబూబకర్ (రజి), హజ్రత్ ఉమర్ (రజి), హజ్రత్ ఉస్మాన్ (రజి), హజ్రత్ అలీ (రజి) సుప్రసిద్ధ ఖలీఫాలయ్యారు. వీరు మన ప్రియప్రవక్త(స)కు ఆప్తులైన మిత్రులు. చాలా మంచివారు, న్యాయ ప్రవర్తన కల విశ్వాసవంతులు. వీరు తమ బాధ్యతలను చక్కగా నిర్వహించారు. మంచి పరిపాలన చేశారు. అల్లాహ్ ఇచ్చిన ధర్మాన్ని పూర్తి ప్రపంచంలో వ్యాపింపజేసే ప్రయత్నం చేశారు.

### హజ్రత్ అబూబకర్ (రజి)

మన ప్రియప్రవక్త (సఅసం) తరువాత హజ్రత్ అబూబకర్ (రజి) ప్రథమ ఖలీఫా అయ్యారు. ఆయన పుత్రిక హజ్రత్ ఆయెషా(రజి)ను మన ప్రియప్రవక్త (స) వివాహమాడారు. హజ్రత్ అబూబకర్ (రజి) మన ప్రియప్రవక్త ప్రాణ స్నేహితుడు కూడా. ఈయన మన ప్రియప్రవక్తను తన తల్లిదండ్రుల కంటే మిన్నగా చూచుకొనే వారు. మహాప్రవక్త (సఅసం) నోట వెలువడిన మాటను విన్నతోడనే సత్యమని అంగీకరించేవారు. అందుచేతనే ఈయన్ను 'సిద్దీఖ్' (రజి) అని కూడా అంటారు. ఈయన రెండుంపావు సంవత్సరాలు ఖిలాఫత్ బాధ్యతలు నిర్వహించారు. కాని స్వల్పకాలంలో ఈయన సాధించిన ఘనకార్యాలు ప్రపంచం మరువరానివి. మన ప్రియప్రవక్త (స) అనారోగ్యంగా ఉన్న సమయంలో హజ్రత్ అబూబకర్ సిద్దీఖ్ (రజి) గారినే సామూహిక నమాజులకు ఇమాముగా నియమించారు. మహాప్రవక్త (సఅసం) ప్రవచించారు: "పూర్తి ప్రపంచంలోని ముస్లిముల విశ్వాసాన్ని ఒక పళ్ళెంలోను, హజ్రత్ అబూబకర్ విశ్వాసం ఒక పళ్ళెంలో వేసి తూచినట్లయితే ఆయన గారి పళ్ళెం మొగ్గుచూపుతుంద"ని

అన్నారు. ఈయన సద్గుణాలను లెక్కిస్తూ 'నింగిలో ఎన్ని నక్షత్రాలున్నాయో ఈయనలో అన్ని సుగుణా లున్నాయి" అని అన్నారు. హజ్రత్ అబూబకర్ దైవమార్గంలో తన సమస్తాన్ని ధారబోశారు. అల్లాహ్ ప్రియ ప్రవక్త(సఅసం) సంతసించేట్లు ఏదైతే సాధ్యపడుతుందో అదంతా చేశారు. అందుచేతనే మన ప్రియప్రవక్త (సఅసం) తరువాత హజ్రత్ అబూబకర్ (రజి) పేరు తీసుకోబడుతుంది. మనందరి మనస్సులో ఈయన పట్ల ఎంతో ప్రేముంది. దైవం ఆయనతో సంతోషపడు గాక!

### హజ్రత్ ఉమర్ (రజి)

హజ్రత్ అబూబకర్ (రజి) తరువాత హజ్రత్ ఉమర్ (రజి) మన ఖలీఫా అయ్యారు. దాదాపు పది సంవత్సరాల పాటు 'ఖిలాఫత్' బాధ్యతలు నిర్వహించారు. ఆయన చేసిన పరిపాలన కాలం యావత్ప్రపంచ చరిత్రలో ఆదర్శపాలన కాలంగా పరిగణించబడుతుంది. మహాత్మాగాంధీ మన మంత్రుల్ని కూడా హజ్రత్ ఉమర్ (రజి) ఆదర్శాన్ని పాటించమని అన్నారు.

హజ్రత్ ఉమర్ (రజి) మన ప్రియప్రవక్తకు ఆప్త మిత్రులు. ఈయన ప్రియ పుత్రిక హజ్రత్ హఫ్సా (రజి) మహాప్రవక్తను వివాహమాడారు. చెడును రూపుమాపుటకు మంచిని వ్యాపింపజేసేందుకు ఈయన ఎంతో కృషి చేశారు. ఈయనలో ఎన్నో సుగుణాలుండేవి. నిరాడంబరంగా ఉండేవారు. బాధ్యతల నిర్వహణలో ఎక్కువ శ్రద్ధాశక్తులు చూపేవారు. ఎవరైనా బాధపడుతుంటే చూచి చాలా పరితపించేవారు. చెడుకు బద్ధశత్రువు హజ్రత్ ఉమర్ (రజి). మహాప్రవక్త అనేవారు: "ఉమర్ (రజి) నీడను కూడా షైతాను భయపడి పారిపోతాడు." ఒక అవిశ్వాసి బానిస హజ్రత్ ఉమర్ (రజి) నమాజులో ఉండగా 'షహీదు' చేశాడు. ఇన్నాలిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్"

### హజ్రత్ ఉస్మాన్ (రజి)

హజ్రత్ ఉమర్ (రజి) తరువాత హజ్రత్ ఉస్మాన్ (రజి) ఖలీఫాగా ఎన్నుకోబడ్డారు. వీరు మన ప్రియ ప్రవక్తకు సన్నిహితులే. హజ్రత్ రుఖియా (రజి) మన ప్రియ ప్రవక్త కుమార్తె. హజ్రత్ రుఖియా (రజి) దివంగతులు అయ్యాక మహా ప్రవక్త (సఅసం) గారి రెండవ పుత్రిక ఉమ్మె కుల్సూమ్ (రజి)ని హజ్రత్ ఉస్మాన్ వివాహం చేసుకొన్నారు. అందుచేతనే ఈయన్ను జన్నూరైన్ 'ద్వితేజస్వి' అని కూడా అంటారు. 'ఖుర్ఆన్' వ్యాప్తికి ఈయన చాలా కృషి చేశారు. లజ్జ సౌశీల్యాలలో పేరుపొందారు. మహాప్రవక్త (సఅసం) అన్నారు : ఉస్మాన్ (రజి) ఎంతో బిడియం కలవారు. వీరంటే దేవదూతలు కూడా సిగ్గు పడుతారు." మొత్తం పన్నెండు సంవత్సరాలు ఖలీఫాగా ఉన్నారు. ఖుర్ఆన్ పఠనంలో అమితాశక్తి చూపేవారు. దివ్యఖుర్ఆన్ పఠిస్తుంటే విద్రోహాలు కుట్రపన్ని ఆయన ప్రాణాలు తీశారు. **ఇన్నాలిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్"**

### హజ్రత్ అలీ (రజి)

హజ్రత్ ఉస్మాన్ (రజి) తరువాత హజ్రత్ అలీ (రజి) ఖలీఫా అయ్యారు. మన ప్రియప్రవక్త ముహమ్మద్ (సఅసం) ప్రియ పుత్రిక హజ్రత్ ఫాతిమా (రజి)ను హజ్రత్ అలీ(రజి) వివాహమాడారు. హజ్రత్ హసన్ (రజి), హజ్రత్ హుసైన్ (రజి) ఈయన సుపుత్రులే. హజ్రత్ అలీ (రజి) బలశాలి,

ధైర్యస్థయిర్యం కలవారు, దైవభయం మెండు. నిరాడంబరజీవి. ఈయన ఖలీఫాగా ఉన్న సమయంలో అరాచకం సృష్టించబడింది. అయినప్పటికీ ఈయన న్యాయానికి ప్రతీకగా నిలిచారు. నమాజు చేయడానికి వెళ్తుంటే ఒక దుష్టుడు ఆయన్ను చంపాడు, షహీదు చేశారు. **ఇన్నాలిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్.**

ఈ నలుగురు ఖలీఫాలు మన ప్రియప్రవక్త (సఅసం) కు సహచరులు. సత్శీలత, దైవపరాయణత వల్ల వీరి జీవిత కాలంలోనే దేవుడు స్వర్గ శుభవార్త అందజేశాడు. ఈ నలుగురి ఖిలాఫత్ సుమారు ముప్పది సంవత్సరాలు ఉండింది. వీరి పరిపాలన అత్యంత శ్రేష్టమయినది. అలాంటి పరిపాలన కోసం ప్రపంచం ఈనాటికీ తపిస్తోంది. యావత్తు ప్రపంచంలో శాంతి సంతోషాలు కలగాలని అల్లాహ్‌ను ప్రార్థిద్దాం.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వండి.**

1. ఖులఫాయే రాషిదీన్ అని ఎవరిని అంటారు?
2. ఎవరిని ఖలీఫా అంటారు?
3. హ్రజత్ అబూ బకర్ (రజి)ని 'సిద్దీఖ్' అని ఎందుకు అంటారు?
4. ఏ ఖలీఫా కాలాన్ని 'ఆదర్శ పాలనా' కాలం అని అంటారు?
5. హ్రజత్ ఉస్మాన్ (రజి)ని 'జిన్నూరైన్' అని ఎందుకు అంటారు?
6. నేటి వరకు ప్రపంచం ఖలీఫాల కాలం కోసం ఎందుకు పరితపిస్తుంది?

**(ఆ) ఈ క్రింది ఖాళీలలో ఖలీఫాల వాక్యానికి తగ్గ ఖలీఫా పేరు వ్రాయండి.**

1. ..........................లో నింగిలో ఎన్ని నక్షత్రాలున్నాయో అన్ని సుగుణాలున్నాయి.
2. ..........................నీడకు షైతాన్ కూడా భయపడి పారిపోతాడు.
3. ..........................ధైర్యస్థయిర్యాలు, దైవభీతి, నిరాడంబరతలో పేరుగాంచారు.
4. ..........................లజ్జ సౌశీల్యంలో పేరుపొందారు.

**(ఇ) ఈ క్రింది ఖాళీలను పూరించండి.**

1. భూమిపై మనమందరం ఆయన.....................
2. ఈ భువిలో ఉన్నంత వరకు అల్లాహ్.....................నెరవేర్చడమే మన పని.
3. పూర్తి ప్రపంచంలోని ముస్లిముల విశ్వాసాన్ని ఒక పళ్లెంలోనూ..........................విశ్వాసం ఒక పళ్లెంలో వేసి తూచినట్లయితే ఆయన గారి పళ్లెం మొగ్గుచూపుతుంది.
4. ఈ నలుగురు ఖిలాఫత్ కాలం సుమారు....................సంవత్సరాలు ఉండింది.

# 21. ప్రవక్తల జీవిత గాథలు

అల్లాహ్ అనేక మంది ప్రవక్తల్ని పుడమిపై పంపాడు. ఈ దైవ ప్రవక్తలు అన్ని దేశాలలో, అన్ని జాతులలో ప్రభవించారు. చిట్టచివరి దైవ సందేశ ప్రబోధకులుగా ప్రవక్త ముహమ్మద్ (సఅసం) వచ్చారు. ఆయన (సఅసం) తరువాత ఇక ఏ ప్రవక్త ప్రపంచంలో రాబోడు. ఆయన (స)కు ముందు ఎంత మంది ప్రవక్తలు వచ్చారు, వారి పేర్లేమి, వారు ఎక్కడ ఏ జాతుల్లో పుట్టారు అనే వివరాలు కేవలం అల్లాహ్‌కే తెలుసు. కాని దివ్యఖుర్‌ఆన్‌లో ప్రస్తావించబడ్డ గత ప్రవక్తల్లో ముగ్గురు ప్రవక్తలు సుప్రసిద్ధులు. వారు హ్రజత్ ఆదం (అలై), హ్రజత్ ఇబ్రాహీం (అలై), హ్రజత్ నూహ్ (అలై). వారిని గురించి మొదటి భాగంలో చదివాము, వారి చరిత్రను తెలిసికొన్నాం. ఇప్పుడు మరో ముగ్గురి ప్రవక్తల గాథలు విందాం. వారి పేర్లు హ్రజత్ యూసుఫ్ (అలై), హ్రజత్ మూసా (అలై) మరియు హ్రజత్ ఈసా(అలై).

### 1. హజ్రత్ యూసుఫ్ (అలై)

హ్రజత్ ఇబ్రాహీం (అలై)ను గురించి ఇంతకు ముందు తెలుసుకొన్నాం. నమ్రూద్ అనే రాజు ఆయన్ను నిప్పులో పడవేయించాడు. అల్లాహ్ ఆజ్ఞ ఇచ్చిన తోడనే మండే అగ్నిజ్వాలలు చల్లగా మారి పోయాయి. ఇబ్రాహీం (అలై) సురక్షితంగా మంటల నుండి బయటపడ్డారు. ఆయన ప్రియపుత్రుడు ఇస్మాయిల్ (అలై) గురించి కూడా ఇంతకు ముందే తెలుసుకొన్నాం. ఇబ్రాహీం (అలై) తన ప్రియ పుత్రుని దైవమార్గంలో ప్రాణార్పణ చేయ సంకల్పించడం, తండ్రి తనయుల త్యాగ శీలత కూడా చూచాము. మన ప్రియప్రవక్త ముహమ్మద్ (సఅసం) వీరి వంశానికి చెందినవారే.

**హ్రజత్ యూసుఫ్ (అలై) వంశం :** హ్రజత్ ఇబ్రాహీం (అలై) గారి మరో సతీమణి ఉండేవారు. వారికి హ్రజత్ ఇస్‌హాఖ్ (అలై) జన్మించారు. ఇస్‌హాక్ (అలై)ను హ్రజత్ ఇబ్రాహీం (అలై) ఈజిప్ట్ సమీపంలో నివాసం ఏర్పాటు చేశారు. ఇటు హ్రజత్ ఇస్‌హాఖ్ (అలై) అటు ఇస్మాయిల్ (అలై) ఇద్దరూ అల్లాహ్ ప్రవక్తలే. హ్రజత్ ఇస్‌హాఖ్ (అలై) గారికి ఒక తనయుడు ఉండేవారు. ఆయన పేరు హ్రజత్ యాఖూబ్ (అలై). ఆయన కూడా దైవ ప్రవక్తగా నియమించబడ్డారు.

హ్రజత్ యాఖూబ్ (అలై)కు పన్నెండు మంది కుమారులు. వారిలో అందరికంటే చిన్నవారిద్దరు ఒక తల్లి పుత్రులు, ఇతర పది మంది ఇతర తల్లుల సంతానం. చిన్న వారిద్దరిలో పెద్ద వారు హ్రజత్ యూసుఫ్ (అలై).

**బాల్యం:** హ్రజత్ యూసుఫ్ (అలై) తన సోదరులందరిలో గొప్ప సద్గుణ సంపన్నులు, వివేకవంతులు కూడా. తండ్రి యాఖూబ్ (అలై) కు హ్రజత్ యూసుఫ్ (అలై) అంటే అమిత గారాబం. హ్రజత్ యూసుఫ్ (అలై) బాల్యంలో ఒక కల కన్నారు. సూర్యచంద్రులతో బాటు పదకొండు నక్షత్రాలు హ్రజత్ యూసుఫ్ (అలై)కు సాష్టాంగపడడం ఆ కల విశేషం. కలను గురించి తనయరత్నం తండ్రికి విన్నవించారు. దూరదృష్టి కల తండ్రి పుత్రుని పెద్ద ప్రతిష్ఠకలవానిగా అల్లాహ్ చేయదలిచాడని గ్రహించాడు. సూర్యచంద్రులు అతని తల్లిదండ్రులుగా భావించబడ్డారు. పదకొండు తారలు ఆయన పదకొండు సోదరులని గ్రహించగలిగాడు.

**సోదరుల దుర్మార్గం :** హజ్రత్ యూసుఫ్ (అలై) సవతి సోదరులు బహు చెడ్డవారు. ఎప్పుడు హజ్రత్ యూసుఫ్ (అలై) అంటే భగ్గుమని మండిపోయేవారు, తమ దారిలో పెద్ద అవరోధంగా భావించేవారు. ఒక దినం సవతి సోదరులు ఒక పన్నాగం పన్నారు. యూసుఫ్ (అలై) ప్రాణాలైన తీయాలి, లేకపోతే తండ్రి నుండి దూరమైనా చేయాలని నిర్ణయించారు. వినోదం కోసం వెళ్ళొద్దామని ఇంటి నుండి దూరంగా తీసికెళ్లారు. అక్కడ ఓ పాడుబడ్డ బావిలో పడేశారు. ఆ సాయంత్రం దొంగ ఏడ్పు ఏడుస్తూ ఇంటికి తిరిగి వచ్చారు. ఇలా అన్నారు: నాన్నగారు! (ఏమని చెప్పాలి) మేమంతా పరుగు పందెంలో ఉన్నాం. యూసుఫ్ (అలై)కు మా సామాన్ల దగ్గర కాపలా పెట్టాం. ఇంతలో ఒక తోడేలు వచ్చింది. యూసుఫ్ (అలై)ను చీల్చి చెండాడి పూర్తిగా తినేసింది."

తనయుల కుట్ర తండ్రికి బోధపడింది. అల్లాహ్‌పై భారం మోపి ఓర్పుతో ఉండిపోయారు.

**యూసుఫ్ (అలై) ఈజిప్ట్‌లో :** పాడుబడ్డ బావిలో యూసుఫ్ (అలై) వేయబడ్డారు. అక్కడ ఒక ప్రయాణీకుల బృందం వచ్చింది. బావిని చూచారు. ఆగిపోయారు. నీటి కోసం ఒక ప్రయాణీకుడు నూతిని చేరాడు. నీళ్ళు తోడడానికి పోగా త్రాగునీటికి మారు యూసుఫ్ (అలై) దొరికారు. పట్టరాని సంతోషంతో యూసుఫ్ (అలై)ను బయటికి తీశాడు. తమతోబాటు ఈజిప్ట్ తీసుకెళ్లాడు. ఈజిప్ట్ పాలకుని దృష్టి ఆ బాలునిపై పడింది. చాలా మంచి బాలుడని తలుస్తూ ఆ బాలుణ్ణి కొన్నాడు.

**రాజభవనం నుండి కారాగారం వరకు :** ఈజిప్ట్ పాలకుని ఇంటిలో యూసుఫ్ (అలై) ఉంటూ వచ్చారు. ఆ కాలంలో ఈజిప్షియన్లు ఏక దైవారాధనను వదలి బహుదైవారాధనను పాటిస్తూ వచ్చారు. దేవీదేవతల్ని కొలుస్తూ వచ్చారు. అల్లాహ్ అసలు ఆరధ్యుడన్న మాటను విస్మరించారు. చెడు పనులు చేస్తూ వచ్చారు. రాజును సూర్యుని అవతారమని భావించారు. యూసుఫ్ (అలై) ఆ సమాజంలో పెరిగి పెద్దవాడయ్యారు. కాని చెడు సమాజం పాటించే తప్పుడు పనులకు బానిస కాకుండా జాగ్రత్త పడ్డారు. ఈజిప్ట్ మంత్రి భార్య కూడా మంచి మహిళ కాదు. హజ్రత్ యూసుఫ్ (అలై)అందచందాలు చూచి ఆకర్షితమైంది. ఆయన్ని కవ్వించింది. యూసుఫ్ (అలై) అందుకు నిరాకరించారు, దాంతో ఆవిడ కోపాగ్నికి ఆహుతయ్యారు. వెంటనే ఆమె యూసుఫ్ (అలై)పై అపవాదు మోపి కారాగారంలో వేయించింది.

యూసుఫ్ (అలై) నిష్కారణంగా జైలులో బందీ అయ్యారు. ఆ జైలులో మరో ఇరువురు ఖైదీలు వచ్చారు. కారాగార రక్షక భటులు, ఇటు బందీలు యూసుఫ్ (అలై) సత్ప్రవర్తన, హితబోధనలకు ముగ్ధులయ్యారు. ఒక దినం వచ్చిన ఇద్దరు ఖైదీలు ఒక కల చూచారు. కల నిజమవుతుందా! కాని దాని అర్థమేమిటో తెలుసుకుందామని వారిరువురు యూసుఫ్ (అలై) వద్దకు వచ్చారు. వారిలో ఒకరు ఇలా అన్నాడు: నేను కల కన్నాను. కలలో మద్యం పిండుతున్నా"నన్నాడు. మరొకడన్నాడు "కలలో ఇలా చూచాను. నా నెత్తిపై రొట్టెలున్నాయి. పక్షులు వాటిని భక్షిస్తున్నాయి". చిక్కిన అవకాశం చేజారకుండా ఉపయోగించుకున్నారు హజ్రత్ యూసుఫ్ (అలై). ఆ ఖైదీలిద్దరికి ఇస్లాం ధర్మ ప్రబోధన చేశారు. మౌలిక ధర్మ సూత్రాల్ని తెలియపరిచారు. దేవీదేవతల ఆరాధన మాని ఏకైక ప్రభువు అల్లాహ్ దాస్యం ఎలా చెయ్యాలనేది చెప్పారు. "ఓ జైలు స్నేహితులారా! మీరే ఆలోచించి చూడండి. బహుదేవతల్ని కొలవడం మంచిదా? అందరికి మించిన శక్తిగల ఏకైక అల్లాహ్‌ను ఆరాధించడం ఉత్తమమా? అల్లాహ్‌ను వదలి

ఏ దేవతలను మీరు పూజిస్తున్నారో, అసలు వారిలో దైవత్వమే లేదు. వాటికి మన పూర్వీకులు కొన్ని పేర్లు పెట్టి పిలుస్తూ వచ్చారు, వారి ననుసరిస్తూ వస్తున్నారు. అందుకు అల్లాహ్ ఎలాంటి ప్రమాణం పంపలేదు. రాజ్య పరిపాలన కేవలం అల్లాహ్‌కే తగినది. ఆయన్ను వదలి మరెవ్వరి దాస్యం చెయ్యకూడదని ఆయనే శాసించాడు. "ఇదేనండి చక్కటి మార్గం. చాలా మందికి తెలియదీ మార్గం" అని బందీలకు హితబోధ చేశారు యూసుఫ్ (అలై). ఆ తరువాత :

ఓ కారాగార మిత్రులారా! మీరు కన్న కలల అర్థం చెబుతాను వినండి. మీలో ఒకరు రాజుగారి మధుపాన సేవకుడవుతాడు. మరొకరు ఉరి శిక్షకు గురవుతాడు. గద్దలు వాని తలను పొడిచి తింటాయి" అని అన్నారు. చివరకు యూసుఫ్ (అలై) చెప్పిన కల భవిష్యవాణి నిజమయింది. ఒక ఖైదీ విడుదలయ్యాడు, మరొకడు ఉరిశిక్ష పొందాడు.

## రాజుగారి స్వప్నం

ఒక దినం రాజు కూడా ఒక కల చూచాడు. కలలో ఏడు బలమైన ఆవులను చూచాడు. వాటిని ఏడు బలహీనమైన ఆవులు తింటున్నాయి. ఏడు కంకులు పండి పచ్చగా ఉన్నాయి.ఏడు కంకులు ఎండి ఉన్నాయి." రాజుగారు ఈ కలను గురించి తెలుసుకోదలచాడు. ప్రజలను పిలిపించాడు. ఎవరు ఏమీ చెప్పలేక పోయారు. చివరకు హజ్రత్ యూసుఫ్ (అలై)ను అడగడం అయింది. యూసుఫ్ (అలై) రాజు స్వప్నం గురించి తెలుపుతూ "ఏడు సంవత్సరాలు పంటలు పుష్కలంగా పండుతాయి. తరువాత ఏడు సంవత్సరాలు భరించారని క్షామం వస్తుంద"న్నారు. క్షామ పీడిత ప్రజల్ని ఎలా కాపాడాలో దాని ఉపాయం కూడా రాజుకు తెలిపారు హజ్రత్ యూసుఫ్ (అలై). ప్రసన్నుడయ్యాడు రాజు. రాజరికపు పూర్తి బాధ్యత హజ్రత్ యూసుఫ్ (అలై)కు అప్పగించాడు. హజ్రత్ యూసుఫ్ (అలై) పరిపాలన మహోన్నతంగా శ్లాఘించబడింది. పండిన పంటల నుండి ధాన్యాగారాలలో పొదుపు చేయించారు, క్షామం వచ్చాక నిలువలను ఉపయోగించుకొన్నారు. పొరుగు దేశాలకు కూడా ధాన్యం సరఫరా చేయించారు.

## ఈజిప్టుకు సోదరుల రాక

హజ్రత్ యూసుఫ్ (అలై) స్వదేశంలో కూడా క్షామం వచ్చింది. ఆయన సోదరులు ధాన్యం కొనుగోలు కోసం ఈజిప్ట్ వచ్చారు. హజ్రత్ యూసుఫ్ (అలై)ను కలిశారు. సోదరుల్ని గుర్తించారు హజ్రత్ యూసుఫ్(అలై). కాని ఆయన సోదరులు ఆయన్ను గుర్తించలేకపోయారు. వారి అవసరాన్ని తీర్చారు యూసుఫ్ (అలై). విక్రయ ధనం కూడా వాపసు చేశారు. ఒక్క షరతు పెట్టారు. మళ్ళీ వచ్చే సమయంలో తమ తమ్ముణ్ణి కూడా తీసుకుని రావాలి లేకపోతే ధాన్యం దొరకదని హెచ్చరించారు. మంచిదని అన్నారు సోదరులు. తండ్రిని ఒప్పించారు. రెండవసారి తమ తమ్ముణ్ణి వెంట తెచ్చారు. సొంత సోదరుని చూచి సంతోషపడ్డారు. హజ్రత్ యూసుఫ్ (అలై). ఎలాగైనా సరే తన సోదరుని వెంట పెట్టుకోవాలని ఒక ఉపాయం పన్నారు వచ్చిన వారు వెనుదిరిగి పోతున్నారు. ధాన్యం వెంట ఉంది. తన తమ్ముని సామానులో విలువైన గిన్నె నొకదానిని పెట్టి, కొంతసేపటికి గిన్నె ఎక్కడుందో చూడమని

సేవకులకు ఆజ్ఞాపించాడు. చూస్తే ఆ గిన్నె తమ్ముని సామానులో వున్నట్లు తేలింది. గిన్నె దొంగిలించారని ఆరోపిస్తూ ఆ తమ్ముణ్ణి తన ఇంటిలోనే ఆపుకొన్నారు హ|జ్రత్ యూసుఫ్ (అలై). వారిలో ఒక సోదరునికి బాధ కలిగింది. నేను కూడా ఇంటికి వాపసు వెళ్ళనని ప్రతిన పూనాడు. మిగిలిన అన్నదమ్ములు స్వదేశం వెళ్లారు. తండ్రి గారికి జరిగిన విషయమంతా చెప్పారు. అతను దొంగతనం చేశాడన్న విషయాన్ని ఆయన నమ్మలేకపోయారు. జరిగిన దానికి చింతిస్తూ సహనం వహించాడు ఆ పితామహుడు.

**కుటుంబ సమేతంగా ఈజిప్ట్‌లో**

మూడవ పర్యాయం కూడా ధాన్యం కావాలని ఈజిప్ట్ వచ్చారు సోదరులు. ఆకలితో అలమటిస్తున్నాం. దయచేసి ఆదుకోండి, అన్నదాతగా క్షుద్బాధ తొలగించండని వేడుకొన్నారు. వారి దయనీయ స్థితిని చూసి చలించిపోయారు యూసుఫ్ (అలై). తన నిజ చరిత్ర తెలిపారు. సవతి సోదరులకు ఆశ్చర్యం కలిగింది. సిగ్గుతో తలవంచేశారు. చేసిన పాపానికి పశ్చాతాపం చెందారు. హ|జ్రత్ యూసుఫ్ (అలై) మందలించక క్షమించి వారిని ఆదరించారు. అందరికి ఈజిప్ట్ రప్పించి వారికి నివాసం ఏర్పాటు చేశారు. పిల్లాజల్లా అందరూ ఈజిప్ట్ చేరాక హ|జ్రత్ యూసుఫ్ (అలై) తన చెంత తల్లిదండ్రుల్ని సింహాసనంపై కూర్చుండబెట్టారు.

హ|జ్రత్ యూసుఫ్ (అలై) ఇలా అన్నారు. నాన్నగారు! చూశారా! ఇది గతంలో మీకు తెలిపిన నా కలకు అర్థం. నా ప్రభువు ఆ కలను నిజంచేసి చూపించాడు. ఆ ప్రభువుకు నేనెంతో కృతజ్ఞుణ్ణి. ఆయనే నన్ను జైలు నుండి విడుదల చేయించాడు, మీతో కలిసే భాగ్యం కల్పించాడు. వారందరూ ఆనందంతో ఆదేశంలోనే జీవితం గడిపారు.

**ఈ చరిత్ర మనకు ఎన్నో విషయాలు ప్రబోధిస్తుంది**

1. అప్పుడప్పుడు అనుకోకుండా ఏదైనా కీడు జరిగితే దాన్నుండి దైవం మేలు చేకూర్చుతాడు. ఈర్ష్యకు చెందిన సవతి సోదరులు హ|జ్రత్ యూసుఫ్(అలై)ను బావిలో పడేశారు. ఈ దుర్మార్గమే ఆయన్ను ఈజిప్ట్‌కు చేర్చింది. అక్కడి ప్రభుత్వ ఆయనకు హస్తగతం అయింది.
2. ప్రతీకారానికి మారు క్షమించడం ఉత్తమం. సవతి సోదరులు హ|జ్రత్ యూసుఫ్(అలై)ను అష్టకష్టాలు పాలుచేశారు. కాని హ|జ్రత్ యూసుఫ్(అలై) వారికి క్షమాభిక్ష పెట్టారు.
3. ఏ పరిస్థితిలోనైనా సరే, ఎక్కడున్నప్పటికీ ప్రజలకు సత్యధర్మ ప్రబోధనం చెయ్యడం అవసరం. హ|జ్రత్ యూసుఫ్(అలై) బందీ చేయబడ్డారు. కారాగారంలో వేయబడ్డారు, అక్కడ ఆయన వ్యర్థంగా ఉండక, ఖైదీలకు దైవ సందేశ ప్రచారం చేస్తూ వచ్చారు.
4. చెడ్డ వారి సాంగత్యం కలిగినా పాటిస్తున్న శ్రేయస్కర మార్గం వదల కూడదు, చెడు అలవాట్లకు గురికాకూడదు. సంస్కరణోద్యమం నడుపుతూ సమాజంలోని చెడును రూపుమాపడానికి ప్రయత్నించాలి. హ|జ్రత్ యూసుఫ్(అలై) చెడు వాతావరణంలో పెరిగి పెద్దవారయ్యారు. అయినప్పటికీ ఆయనపై చెడు ప్రభావం పడలేదు. చెడ్డవారి శ్రేయాన్నే అపేక్షించి వారి సంస్కరణకు నడుము కట్టారు.

## 2. హజ్రత్ మూసా (అలై)

**వంశం:** హజ్రత్ మూసా (అలై) హజ్రత్ యూసుఫ్ (అలై) వంశానికి చెందిన వారు. హజ్రత్ యూసుఫ్ (అలై) జీవిత గాథలో ఆయన తన కుటుంబీలకులందరిని ఈజిప్ట్ రప్పించడం, అక్కడే వారికి నివాసం కల్పించడం చదివాం. ఆ దేశంలోనే వారి సంతతి అభివృద్ధి చెందింది. వీరందరు హజ్రత్ యాఖూబ్ (అలై) సంతానికి చెందిన వారు. హజ్రత్ యాఖూబ్ (అలై) మరో పేరు ఇస్రాయీల్. అందుచేత ఈ సంతతి వారందరికి బనీ ఇస్రాయీలీలు లేదా ఇస్రాయీలీలు అని కూడ అంటారు. చాలా కాలం వరకు ఇస్రాయీలీలు ఈజిప్ట్ దేశంలో పేరు ప్రతిష్ఠలు కలవారిగా ఉన్నారు. రానురాను ఈ వంశీయులలో అనేక చెడులు వచ్చాయి. అందుచేత ఈజిప్షియన్ల దృష్టిలో వారు దిగజారిపొయ్యారు. ఆ దేశ వాసులు వీరిని నికృష్టులుగ భావిస్తూ వారికి ఎన్నో బాధలు పెట్టసాగారు. ఈజిప్ట్ పరిపాలకులను (ఫిరౌనులు) అని పిలిచేవారు. ఫిరౌన్లు తమకు తాము సూర్యదేవత అవతార పురుషులని ప్రజల చేత పూజ చేయించుకొనేవారు. ఫిరౌను వద్దకు ఎవరో జ్యోతిష్కుడు వచ్చాడు, బనీ ఇస్రాయీలీల సంతతిలో ఒక శిశువు పుట్టబోతున్నాడు. ఆ శిశువు చేతిలో మీ రాజరికం వినాశమవుతుంది అని జోశ్యం పలికాడు. ఈ పలుకులు వింటూనే దేశమంతటా ఇక పుట్టబోయే బనీ ఇస్రాయీలీల శిశువులందరిని వధించండి అని శాశించాడు ఫిరౌను. బాలికల్ని వదిలివేయండి అని కూడా అన్నాడు.

**బాల్యం :** శాసనం ఇటు చేయడం, అటు మూసా (అలై) జన్మించడం జరిగింది. ఆయన తల్లికి అవధుల్లేని దుఃఖం కలిగింది. తన తనయుని కూడా రాజభటులు ఎక్కడ చంపుతారో అనే భయం ఆమెను భయపెట్టింది. అల్లాహ్‌పై భారం మోపింది. సృష్టికర్త కూడా ఆ తల్లికి ధైర్యం కలిగించాడు. దైవాజ్ఞ ప్రకారం తల్లి ప్రియ పుత్రుని ఒక పెట్టలో పెట్టి నదిలో వేసింది. ఆ నది తీరాన ఫిరౌను రాజభవనం ఉంది. నీటిలో తేలియాడుతూ మూసా (అలై) ఉన్న పెట్టె అంతఃపురాన్ని తాకింది. ఫిరౌను సతీమణి ఆ పెట్టెను తెప్పించి, తెరిపించి చూచింది. అందులో బాలుడున్నాడు. సంతోషంతో ఆ బాలుని తీసుకొని పెంచదలిచింది. కాని బాలుడు ఎవరి పాలు త్రాగ నిరాకరించాడు. రాజ భవనంలోనే మూసా (అలై) సోదరి ఉండేది. తమ్ముడు ఎలా ఉన్నాడో తెలుసుకోదలచింది. ఆమె రాణి గారితో ఇలా అన్నది: "నేనొక మాతృ మూర్తిని చూపిస్తాను. ఆమె అతణ్ణి పెంచుతుంది: ఈ విధంగా ఎవరి గుట్టురట్టు కాకుండా మూసా (అలై) తల్లినే బాలుని పెంచడానికి పెట్టడం జరిగింది. ఎడబాసిన తనయుడు మళ్ళీ తల్లి ఒడికి చేరేట్లు చేశాడు అల్లాహ్.

**యవ్వనం:** ఫిరౌను ఇంటిలో మూసా (అలై) పెంచబడ్డారు. పెద్దయ్యారు, యవ్వనానికి వచ్చారు. ఒక దినం రాత్రి సమయం. అందరు నిద్రపోతున్నారు. ఒక ఈజిప్షియన్ ఇజ్రాయీల్ వంశీయుని చితకబాదుతున్నాడు. మూసా (అలై) అతణ్ణి ఆపారు. కాని దౌర్జన్యపరుడు మూసా (అలై) మాటను వినలేదు. మూసా (అలై) జరుగుతున్న జులుం చూడలేకపోయారు. ఒక గుద్దుతో అతణ్ణి పరలోకానికి పంపివేశారు.

**మద్యన్‌లో:** మూసా (అలై)కు చేసిన పనికి ఎక్కడ శిక్షపడుతుందేమోనన్న భయం కలిగింది. ఈజిప్ట్ వదలి వెళ్లిపోయారు. వెళుతూ వెళుతూ ఈజిప్ట్‌కు దూరాన ఉన్న మద్యన్‌కు చేరుకున్నారు.

ప్రయాణ బడలికతో ఒకచోట నీడ, నీరున్న ప్రదేశంలో కూర్చున్నారు. అక్కడ కొందరు తమ తమ పశువులకు నీరు త్రాపుచున్నారు. కాని ఇద్దరు ఆడపడచులు ఒకవైపు చాలాసేపు నుండి నిలుచున్నారు. వారిపై మూసా (అలై)కు జాలి కలిగింది. వెంటనే వారి పశువులకు నీరు త్రాగించారు మూసా(అలై). ఆ బాలికలు ఆయన (అలై) సహాయాన్ని చూచి సంతోషపడ్డారు. ఇంటికెళ్ళారు. తమ తండ్రిగారితో ఆ యువకుని సహాయాన్ని వివరంగా తెలియపరిచారు. వారి తండ్రి అతణ్ణి ఒక ప్రయాణీకుడిగా భావించి ఇంటికి రమ్మని పిలిపించాడు. పెద్ద మనిషి దగ్గరకు వచ్చాడు. ప్రేమతో పలుకరిస్తూ మూసా (అలై)ను గురించి తెలుసుకున్నాడు. ఆయన్ని ఓదార్చి నిర్భయంగా ఇంటిలో ఉండమన్నాడు. తన కూతురితో వివాహం కూడా చేయించాడు.

**ప్రవక్త కావడం:**ఎనిమిది, పది సంవత్సరాలు గడిచాయి. సతీమణితో సహా ఈజిప్ట్‌కు వెళ్తున్నారు. రాత్రి సమయం. దారి అగుపించటం లేదు. దూరాన ఒక వెలుగు చూచారు. అక్కడెవరో వున్నారని, సతీమణిని అక్కడే నిలిపి, దూరానగుపడే వెలుగు దగ్గర నిప్పు తీసికోవడానికి, మార్గ సూచనలు కనుగొనడానికి వెళ్లారు మూసా(అలై). దగ్గరకు వెళ్లి చూడగా దూరానగుపించిన వెలుగు ఒక చెట్టుపై ఉంది. చెట్టు నుండి ఒక శబ్దం వినబడింది. అది అల్లాహ్ ఇచ్చిన ఆజ్ఞ. మూసా (అలై)ను అల్లాహ్ ప్రవక్త చేశాడు. ప్రవక్తను గుర్తించే చిహ్నాలేమిటని మూసా (అలై) అడిగారు. ఎవరైనా ప్రవక్త కాదని వాదిస్తే నిరూపణ చేసుకోవాలని ఆయన ఆవేదన. అల్లాహ్ ఆజ్ఞ అయ్యింది. "నీ చేతి కర్రను నేలపై వేసేయి" మూసా (అలై) చేతి కర్రను విసరగా అదిసజీవ సర్పంగా మారింది. మూసా (అలై) గాబరా పడ్డారు. అల్లాహ్ మళ్లీ అన్నాడు. "భయపడకు. ఆ పామును పట్టుకో". ధైర్యం తెచ్చుకొని మూసా (అలై) ఆ పామును పట్టుకొన్నారు. మళ్ళీ అది చేతికర్రగా మారింది. మూసా (అలై) ప్రవక్త అని నిరూపించుకొనేందుకు ఇదొక గుర్తు. రెండవ గుర్తు, తన చేతిని చంకభాగన పెట్టి బయటకు తీయగానే అది చంద్రునిలా మెరుస్తుంది. మూసా (అలై) తన తమ్ముడైన హారూన్ (అలై)ను కూడా దైవ ప్రబోధకునిగా చెయ్యమని ప్రార్థించాడు. అల్లాహ్ ఆయన ప్రార్థన అంగీకరిస్తూ తమ్ముడు హారూన్ (అలై)ను కూడా ప్రవక్తగా చేశాడు.

**ఫిరౌను దర్బారులో :** అల్లాహ్ ఆజ్ఞను పురస్కరించుకొని ఇరువురు మూసా (అలై), ఆయన సోదరుడు ఫిరౌను దర్బారు చేరారు. ఫిరౌను నుద్దేశించి ఇలా అన్నారు. "అల్లాహ్ పట్ల విశ్వాసం ప్రకటించండి. ఆయన ఆజ్ఞల్ని అనుసరించండి. జులుం చేయడం మానండి. కాని గర్వోన్నతుడు ఫిరౌను. వారి మాటల్ని పెడచెవినపెట్టాడు. దైవ ప్రవక్త కావడానికి సాక్ష్యాధారలేమిటి అని అడిగాడు. మూసా (అలై) దైవం తనకిచ్చిన రెండు గుర్తుల్ని ప్రదర్శించారు. ఫిరౌను వాటిని చూచి ఇది మంత్రతంత్రాల మాయ అనీ, మాంత్రికులు కూడా ఇలా చేయగలరని కావాలంటే మాంత్రికులతో పోటీకి దిగవచ్చని అన్నాడు.

**మాంత్రికులతో పోటీ:** జాతర వచ్చింది. ఉత్సవ ప్రదేశంలో జనం కిక్కిరిసి ఉన్నారు. మూసా (అలై)తో పోటీ కోసం ఆరితేరిన మాంత్రికులు మైదానంలో దిగారు. కుతూహలంతో ప్రజలు, మాంత్రికులు

ఎవరు గెలుస్తారో చూద్దామని తహతహపడుచున్నారు. పోటీ ప్రారంభమైంది. కన్నులు మూసుకొని మాంత్రికులు తాళ్ళను మైదానంలో వేశారు. అవి పాముల్లా తిరుగుతూ కనబడ్డాయి. అల్లాహ్ ఆజ్ఞతో మూసా (అలై) తన చేతికర్రను విసిరారు. అది కొండచిలువగా మారింది మాంత్రికులు చూపించిన పాములన్నిటిని దిగమ్రింగింది. మాంత్రికులకు అర్థమయింది. మూసా (అలై) చూపిన మహత్యం మంత్రం కాదు, అల్లాహ్ ప్రసాదించిన మహా చిహ్నం అది. వారందరు వెంటనే అల్లాహ్ పట్ల విశ్వాసం ప్రకటించారు, మూసా (అలై) అనుచరులయ్యారు. కాని ఫిరౌను మస్తిష్కంలో ఈ మాట రాలేదు. పైగా మాంత్రికుల్ని చంపేస్తానని గర్జించాడు. మాంత్రికులు అతని బెదిరింపుల్ని లెక్కచెయ్యలేదు.

**ఫిరౌను మునిగిపోవడం:** ఫిరౌను, అతని జాతీయులను నచ్చజెప్పడానికి, అల్లాహ్ ఆజ్ఞల్ని అవగాహన చేసుకోవడానికి అనేక చిన్న పెద్ద శిక్షలకు వారినీ గురిచేశారు. ఒకప్పుడు క్షామం వచ్చింది, మరొకప్పుడు వరదలు వచ్చాయి, ఇంకోప్పుడు మిడతల దండు పంటలన్ని తింది. ఇంకా రక్తపు వర్షాలు కురిశాయి. అన్ని వచ్చినా అల్లాహ్ పట్ల విశ్వాసం ప్రకటించక, బనీ ఇస్రాయీల్ సంతతి వారిపై దౌర్జన్యం సాగిస్తూ వచ్చారు. చివరకు ఒక రాత్రి మూసా (అలై) బనీ ఇస్రాయీలీలను వెంట తీసుకొని వెళ్తున్నారు. ఫిరౌను సైన్యం వారిని వెంటాడింది. దారి మధ్యన సముద్రం ముందొచ్చింది. దైవాజ్ఞ ప్రకారం మూసా (అలై)తన చేతికర్రతో సముద్రాన్ని కొట్టారు. సముద్రంలో దారి ఏర్పడింది. మూసా (అలై) తన అనుచరులతో ఆ మార్గం గుండా అవతలివైపు చేరుకొన్నారు. ఫిరౌను, అతని బలగాలు అదే దారిన వెళ్ళడం మొదలెట్టాయి. కాని సముద్రంలోని రెండు వైపుల నీరు వచ్చి కలిసిపోయింది. ఫిరౌను తన సైన్యంతో సహా ఆ సముద్రంలో మునిగిపోయాడు. మూసా (అలై) అతని జాతీయులు ఆవలి తీరాన్నుండి ముందుకు వెళ్ళారు. అబిసీనియా దేశపు లోయలో చేరారు. అక్కడ అల్లాహ్ వారి కోసం మేఘాల ఛాయ కల్పించాడు. తినడానికి రుచికరమైన మన్న్, సల్వాలను దించాడు. నలుబది దినముల కోసం అల్లాహ్ మూసా (అలై)ను 'తూర్' కొండపై పిలిపించాడు. అక్కడే ఆయనకు తౌరాతు గ్రంథం ఇచ్చాడు. కాని బనీ ఇస్రాయీలులు మూసా (అలై) లేని సమయంలో బంగారం, వెండితో ఒక ఆవుదూడను చేశారు, బహుదైవారాధకులైన అప్పటి ఈజిప్షియన్లు లాగే ఆ దూడను పూజిస్తున్నారు. అక్కడే దేశవాసుల మధ్య జీవితం గడుపుతూ వారి చెడు అలవాట్లకు బనీ ఇస్రాయీలు కూడా గురయ్యారు. మూసా (అలై) 'తూర్' కొండ నుండి వాపసు వచ్చారు. తన అనుచరలపై మండిపడ్డారు. చేసిన తప్పిదానికి పశ్చాత్తాపపడి క్షమించమని దైవాన్ని వేడుకోమన్నాడు.

ఆ తరువాత అందరితోపాటు ఇంకా ముందుకు ప్రయాణం సాగింది. తరువాత తమ ముత్తాతల దేశం సిరియాను వశపరుచుకోదలిచారు. కాని ఆయన అనుచరులు వట్టి పిరికిపందలు. శౌర్యం, ధైర్యం లేనివారు. శత్రువులతో పోరాడడానికి సంసిద్ధత వ్యక్తపరచలేదు. చివరకు వారంటే అల్లాహ్‌కు ఆగ్రహం కలిగింది. మార్గభ్రష్టులు చేసి నలువది సంవత్సరాల వరకు ఆ ఎడారిలోనే వారిని దేశ దిమ్మరులుగా చేశాడు.

**ఒక మహాపురుషుడ్ని కలుసుకోవడం :** అల్లాహ్ మూసా (అలై)కు ఒక మహాపురుషునితో కలువమని ఆజ్ఞ ఇచ్చాడు. అతనితో కలువడానికి వెళ్ళాడు మూసా (అలై). తినడానికి వెంట ఒక చేప తీసికొని

వెళ్ళారు. దారి మధ్యన ఒక చోట విశ్రాంతి తీసుకొంటున్నారు. వెంట తెచ్చిన చేప దైవాజ్ఞవల్ల ఎగిరి నీటిలోకి దూకింది, వెళ్ళిపోయింది. ఎవరితో కలువడానికి వచ్చారో ఆ మహావ్యక్తి అక్కడే ఉండేవారు. మూసా (అలై) వారితో కలసి, వెంట ఉండి ఒక నావలో ప్రయాణం చేస్తున్నారు. మధ్యలో ఆ మహనీయుడు నావకు రంధ్రం వేశాడు. ఇంకా ముందుకు వెళ్ళి ఒక అమాయక బాలుని గొంతు కోశాడు. ఇంకా కొంత ముందుకు వెళ్ళిన తరువాత ఒక పడిపోతున్న గోడను ప్రతిఫలం పుచ్చుకోకుండా మరమ్మత్తు చేశాడు. ఇవన్నీ చూస్తూ మూసా (అలై) సహించలేకపోయారు. విమర్శించి ఆయన్ను నిలదీసి అడిగారు. మహర్షి ఈ పనులన్నీ అల్లాహ్ ఆజ్ఞలననుసరించే చేశానన్నాడు. నావ బీద నావికుల్ది. ఇక్కడి పాదుషా దౌర్జన్యపరుడు. మంచి నావలను తన హస్తగతం చేసుకొంటాడు. పడవలో దోషముంటే దానిని తీసుకోడు. ఇక పిల్లవాడు మంచి తల్లిదండ్రుల సంతానం. ఆ తల్లిదండ్రులు పసికందుని వల్ల సంతోషం కలిగి ఉన్నారు. కాని అబ్బాయి పెద్ద వాడయ్యాక తల్లిదండ్రులను కష్టపెడతాడు. మున్ముందు కష్టాలు రాకుండేందుకు ఇప్పుడు అబ్బాయిని హతమొనర్చడమయింది. మూడవ విషయం గోడ అనాథ బాలురది. ఆ బాలుర దివంగత తండ్రి గోడ క్రింద ఒక ఖజానా దాచి ఉంచాడు. గోడ పడిందంటే అనాథ బాలురు చిన్నవారైనందున ఆ గుప్తధనం పరులు దోచుకొంటారు. మరమ్మత్తు చేశాను. అనాథ బాలురు పెద్ద వారయ్యాకే ఆ గోడ పడుతుంది, అప్పుడు వారు తండ్రి దాచిన ధనాన్ని తీసుకొంటారు. హజ్రత్ మూసా (అలై)కు అన్ని విషయాల మర్మము అర్థమయింది, తృప్తి చెందారు. ఈ చరిత్ర అవగాహన వల్ల మనకెన్నో విషయాలు అర్థమవుతున్నాయి.

1. అల్లాహ్ అద్భుత శక్తి సంపన్నుడు. ఆయన పనులు కూడా అద్భుతంగా ఉంటాయి. పుట్టిన శిశువు ఫిరౌనును అంతం చేయవలసి ఉంది. అందుచేత మరణానికి మారు ఆ శిశు రక్షణ అంత్ణపురంలోనే జరిగింది.
2. అల్లాహ్ వరప్రసాదం అనన్య సామాన్యం. దానికోసం ఒక చోటు అంటూ లేదు. విభ్రాంతి కలిగేటట్లు అనుకోకుండనే ఇస్తాడు అల్లాహ్. మూసా (అలై) వెళ్ళింది నిప్పుకోసం. కాని అతనికి అక్కడ ప్రవక్త బాధ్యతలు లభించాయి.
3. అల్లాహ్ పనులన్నిటిలో ఎన్నో ఉపాయాలుంటాయి. అవి మనకర్థం కావు. మహాపురుషునితో అల్లాహ్ చేయించిన పనులు పైకి ఆక్షేపణగా కనబడ్డాయి. కాని అందులో ఎంతో వివేకం ఉంది. మహాపురుషుని నోట అందులో దాగివున్న రహస్యం తెలుపబడింది.
4. మన హృదయాలలో సృష్టికర్త పట్ల విశ్వాసం అంకురిస్తే మరెవరూ మనల్ని బెదిరించి, దైవమార్గం నుండి మరల్చలేరు. మాంత్రికులను ఫిరౌను భయపెట్టాడు. కాని వారి విశ్వాసంలో ఏ మాత్రం కొదవరాలేదు.
5. విశ్వాసంలో బలహీనత కలవారు, దుర్జన సాంగత్యం వల్ల చెడు పనులు చేయపూనుతారు. ఇస్రాయీలులు ఈజిప్షియన్ల వెంట ఉంటూ వారిలాగే అల్లాహ్‌ను వదలి, ఆవుదూడను పూజింపసాగారు. పైపెచ్చు వారు ప్రవక్తల సంతానంలోని వారు!

## 3. హజ్రత్ ఈసా (అలైహిస్సలాం)

బనీ ఇస్రాయీలుల పట్ల అల్లాహ్ కరుణ చూపాడు. ఎన్నో వరాలు వారిపై వర్షించాడు. అనేక ప్రవక్తల్ని వారి సంతతి వారిలో నుద్భవింపజేశాడు. హజ్రత్ ఈసా (అలై) ఈ సంతతివారే. మూసా (అలై) తరువాత ఎన్నో శతాబ్దాలు గడిచాయి. బీబీ మరియమ్ (అలై)కు తనయుడు కలిగాడు. ఈయన పేరు ఈసా (అలై). బీబీ మరియమ్ (అలై) గారి తల్లి గర్భంలో ఉన్నప్పుడు ఆమె తల్లి ఒక ప్రతిన పూనింది. పుట్టబోయే బిడ్డను అల్లాహ్‌కు సమర్పిస్తానన్నది. ఆమె తనకు మగశిశువు కలుగుతాడని ఆశించింది. కాని దైవాభీష్ట ప్రకారం కూతురు కలిగింది. అయినప్పటికీ ఆ అమ్మాయిని అల్లాహ్‌కు అర్పించుకొంది. అల్లాహ్ ఆమె మ్రొక్కుబడిని అంగీకరించాడు. మరియమ్ (అలై)ను బైతుల్ మఖ్దిస్‌కు పంపించారు. ఆమెకు అక్కడ హజ్రత్ జక్రియా (అలై) సంరక్షకుడుగా ఉన్నారు. కాని దైవ మాయ విచిత్రమయింది. హజ్రత్ జక్రియా (అలై) హజ్రత్ మరియమ్ (అలై) గదిలో ఎప్పుడు వెళ్ళినా ఏవో తిను పదార్థాలు అక్కడ వుండేవి. విచారించగా ఆ పదార్థాలు అల్లాహ్ పంపారని తెలిసేది.

**జననం :** పెరిగి పెద్దవారయ్యారు హజ్రత్ మరియమ్ (అలై). సద్గుణ సంపన్నురాలు, సౌశీల్యవతి ఆమె. ఎప్పుడు అల్లాహ్ ఆరాధనలో నిమగ్నమై ఉండేవారు. ఒక దినం అల్లాహ్ ఆరాధనలో నిమగ్నమై ఉన్నారామె. దేవదూతలు వచ్చారు. ఆమెకొక మంచి కుమారుడు కలుగుతాడను శుభవార్త ఇచ్చారు. ఆశ్చర్యమేసింది. ఓ అల్లాహ్! నాకు సంతానం ఎలా కలుగుతుంది. ఏ పురుషుడు నన్ను తాకను తాకలేదు. నాకు అక్రమ సంబంధం లేదు, అని ఆమె అన్నారు సౌశీల్యం కల అమాయక అమ్మాయి. అవివాహిత కూడ. ఆమెకు శిశువు కలుగుతుందంటే ఎలా నమ్మగలం. కాని అల్లాహ్ ఏమైనా చేయగలడు. తల్లీ తండ్రి లేకుండా ఆదం (అలై)ను సృష్టించిన అల్లాహ్‌కు తల్లి ఉండగా తనయుని జన్మింపజేయడం కష్టతరమా? అల్లాహ్ ఆజ్ఞ ప్రకారం బీబీ మరియమ్( అలై) గర్భవతి అయింది, శిశువు జన్మించనే జన్మించాడు. ఎంతో సంతోష సమయం. ఆ బాలుడు అల్లారు ముద్దుగా ఉన్నాడు. దైవప్రవక్త కాబోతున్నాడు కూడా. ప్రజలకు సన్మార్గం చూపబోతున్నాడు. మరియమ్ (అలై)కు దుఃఖం కలిగింది. ప్రజలలో కూడా మంచి చెడులు కలవారుంటారు. దుర్జనులు ఈ సంఘటనను విశ్వసించరని ఆమెకు తెలుసు. దుష్ప్రచారం చేస్తారని కూడా తెలుసు. కాని అల్లాహ్ హజ్రత్ ఈసా(అలై)కు ఎన్నో మహత్యాలనిచ్చి పంపాడు. మామూలు వ్యక్తి కూడా వాటిని చూస్తూ ఈసా (అలై)ను ప్రవక్తగా విశ్వసిస్తాడు, హజ్రత్ మరియమ్ (అలై) నిష్కళంకి అని గ్రహిస్తాడు కూడా. మతిలేని మూర్ఖుడయితేనే మరో విధంగా భావిస్తాడు.

**బాల్యం:** హజ్రత్ మరియమ్ (అలై) బిడ్డతో సహా పట్టణానికి వచ్చారు. ప్రజలు గుమిగూడారు. కొందరు ఆ మహాతల్లిని తిట్టారు, శపించారు. దుర్జనుల పని సజ్జనులను పరాభవం పాలు చెయ్యడమే కదా! హజ్రత్ మరియమ్ (అలై) వారి మాటలన్ని సహిస్తూ మౌనం వహించారు. సత్శీలత కలవారి పాలిట సంరక్షకుడు సృష్టికర్తే కదా! ఊయలలో ఉన్న పసికందు పలుకనారంభించాడు.

"నేను అల్లాహ్ దాసుణ్ణి. ఆయనే నాకు మానవులకు హితబోధ చేయడానికి గ్రంథాన్నిచ్చాడు.

నన్ను ప్రవక్తగా చేశాడు. నేను ఉన్న ప్రాంతాన్ని శుభ వంతం చేశాడు. సజీవంగా ఉన్నంత వరకు నమాజు చేయమని జకాతు చెల్లించమని ఆజ్ఞాపించాడు. తల్లి హక్కును నెరవేర్చమని చెప్పాడు. తల్లికి అవిధేయతకలవానిగా, తల్లిపట్ల దౌర్జన్యం చేసేవానిగా నన్ను చెయ్యలేదు".

హ(జత్ ఈసా (అలై) శైశవ దశలోనే ఈ విధంగా పలుకడం చూచిన ప్రజలు ఆశ్చర్య చకితులయ్యారు. ఇలా మాట్లాడటం ఒక దైవ చిహ్నంగా గుర్తించి మంచి వారు పల్లెత్తు మాట పలుకలేదు. కాని చెడ్డవారు తమ స్వభావాన్ని మార్చుకొనక నానా నిందోపవాదములు మోపుతూ దుష్ప్రచారానికి దిగారు. ఇహపరాలను చెడుపుకొన్నారు.

హ(జత్ ఈసా (లై) పెద్ద వారయ్యారు. ఆయనపై అల్లాహ్ 'ఇంజీలు' గ్రంధాన్ని అవతరింపజేశాడు. దైవోపదేశానుసారం హ(జత్ ఈసా (అలై) ప్రజలకు చక్కటి మార్గం చూపాడు. తన తర్వాత మరో ప్రవక్త ప్రపంచంలో రాబోతున్నాడను శుభవార్తనిచ్చాడు. బనీ ఇస్రాయీలులు చేస్తున్న చెడును విమర్శించారు. మంచి పనులు చెయ్యమని చెప్పారు. అల్లాహ్ ప్రసాదించిన అనేక చిహ్నాలను, మహత్యాలను ప్రజల ఎదుట ప్రదర్శించారు. మట్టితో పక్షిబొమ్మను చేశారు, అందులో గాలి వూదడంతో అల్లాహ్ ఆజ్ఞ వల్ల అది సజీవమై గగన వీధిలో విహరించింది. పుట్టుకతో గ్రుడ్డిగా ఉన్న వారి కన్నులపై తన చెయ్యిని త్రిప్పగా దైవాజ్ఞ వల్ల కబోదికి కంటి చూపు వచ్చింది. కుష్ఠురోగుల వ్యాధిని తొలగించేవారు. ఒక శవాన్ని తాకగా అల్లాహ్ ఆజ్ఞ వల్ల అది సజీవమైంది. దైవం ఆయనకు ప్రసాదించిన ఈ చిహ్నాలన్నిటిని బనీ ఇస్రాయీలులు చూచేవారు కాని ఆయనపై విశ్వాసం తెచ్చేవారు కారు. వారి చెడు ప్రవర్తనను మార్చుకొనేవారు కారు. పైపెచ్చు ఈసా (అలై)కు శత్రువులయ్యారు. దైవ విశ్వాసంలేని తమ రాజుకు ఫిర్యాదు చేశారు. అపవాదు మోపారు. తప్పుడు కేసుల్లో ఇరికించారు. అసత్య సాక్ష్యంతో ఉరిశిక్ష వేయించారు. ఏమి చేసినా దైవప్రవక్తకు ఏ నష్టం కలుగుతుందని. దుష్టుల ఇహపరాలే చెడ్డాయి. అల్లాహ్ చివరకు ఈసా (అలై)ను వాపసు తీసికొన్నారు. శత్రువుల నుండి ఒక వ్యక్తిని ఉరిపై ఎక్కించాడు.

ఈసా (అలై) ప్రవచనాలను బీద మత్స్యకారులు విన్నారు. వారు ఆయన పట్ల విశ్వాసం ప్రకటించారు. ఆ బీద వారే ఈసా (అలై) తెచ్చిన ధర్మాన్ని ప్రచారం చేశారు. హ(జత్ ఈసా( అలై) పేరు లోకప్రసిద్ధి అయింది. ఇజ్రాయీలులు తమ షైతాను పనుల వల్ల పరాభవం పాలయ్యారు. ఈ దినం కూడా హ(జత్ ఈసా (అలై) పేరును ప్రస్తావించే సజ్జనులు, దుర్జనులు ఈ ప్రపంచంలో కోట్లాదిమంది ఉన్నారు.

## అభ్యాసం

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వండి.**

1. హజ్రత్ యూసుఫ్ (అ) కుటుంబం గురించి నీకేమి తెలుసు?
2. బాల్యంలో హజ్రత్ యూసుఫ్ (అ) ఏ కల కన్నారు?
3. హజ్రత్ యూసుఫ్ (అ) సవతి సోదరులు ఆయన పట్ల ఎలా వ్యవహరించారు?
4. హజ్రత్ యూసుఫ్ (అ) కారాగారంలో ఖైదీలకు ఎలాంటి విషయాలు నేర్పారు?
5. రాజు రాజరికపు బాధ్యతలన్ని ఆయన (అ)కి ఎందుకు అప్పగించాడు?
6. హజ్రత్ యూసుఫ్ (అ) బాల్యంలో కన్న కల ఎలా నెరవేరింది?

**(ఆ) హజ్రత్ యూసుఫ్ ఈ క్రింది కలలకు భావం ఏమని తెలిపారు?**

1. వారిలో ఒకడు ఇలా అన్నాడు : నేను కల కన్నాను. 'కలలో మద్యం పిండుతున్నా'నన్నాడు. మరొకడన్నాడు, కలలో ఇలా చూచాను, 'నా నెత్తిపై రొట్టెలున్నాయి. పక్షులు వాటిని భక్షిస్తున్నాయి'.
2. ఏడు బలమైన ఆవులను ఏడు బలహీనమైన ఆవులు తింటున్నాయి. ఏడు కంకులు పచ్చగా ఉన్నాయి. ఏడు కంకులు ఎండి ఉన్నాయి.

**(ఇ) ఈ క్రింది ఖాళీలను పూరించండి.**

1. హజ్రత్ యూసుఫ్ (అ) తండ్రి పేరు.........................
2. హజ్రత్ యాఖూబ్ (అ)కు ............................మంది కుమారులు.
3. హజ్రత్ యూసుఫ్ (అ) తన సోదరులందరిలో గొప్ప...................సంపన్నులు.
4. హజ్రత్ యూసుఫ్ (అ)ను............................కొన్నాడు.
5. యూసుఫ్ (అ)........................గా జైలులో బందీ అయ్యారు.

## హజ్రత్ మూసా (అలైహిస్సలామ్)

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు వ్రాయండి.**

1. హజ్రత్ మూసా (అ) ఎక్కడ పెరిగి పెద్దవారయ్యారు?
2. హజ్రత్ మూసా (అ) ఈజిప్టు నుంచి ఎందుకు వెళ్లిపోయారు?
3. అల్లాహ్ ఆయన (అ)కి ప్రవక్తగా ఏ ఏ నిరదర్శనాలు ప్రసాదించాడు?
4. హజ్రత్ మూసా (అ) ఫిరౌన్ దర్బారులో ఆయనతో ఏమన్నారు?
5. అల్లాహ్ ఫిరౌన్‌ను ఆయన జాతిని ఎందుకు సముద్రంలో ఎందుకు ముంచాడు?

6. హజ్రత్ మూసా (అ) జాతి నలభై సంవత్సరాల వరకు ఎడారిలో దేశదిమ్మరులుగా ఎందుకు తిరిగారు?

**(ఆ) ఈ క్రింది ఖాళీలను పూరించండి.**

1. హజ్రత్ మూసా (అ) హజ్రత్......................వంశానికి చెందిన వారు.
2. హజ్రత్ యాఖూబ్ (అ) మరో పేరు..........................
3. ఈజిప్టు పరిపాలకులను..........................అని పిలిచేవారు.
4. మూసా (అ)....................నే పెంచడానికి పెట్టడం జరిగింది.
5. హజ్రత్ మూసా (అ) చేసిన పనికి ఎక్కడ శిక్షపడుతుందేమోనన్న భయంతో ఈజిప్టుకు దూరాన ఉన్న................కు చేరుకున్నారు.
6. అల్లాహ్ ఆయన (అ) ప్రార్థన అంగీకరిస్తూ తమ్ముడు......................ను కూడా ప్రవక్తగా చేశాడు.

## 23. హజ్రత్ ఈసా (అలైహిస్సలామ్)

**(అ) ఈ క్రింది ప్రశ్నలకు జవాబులు ఇవ్వండి.**

1. బీబీ మర్యమ్(అ)ను బైతుల్ మఖ్దిస్‌కు ఎందుకు పంపడం జరిగింది?
2. దైవదూత బీబీ మర్యమ్ (అ)కి ఏమని శుభవార్తనిచ్చాడు?
3. హజ్రత్ ఈసా (అ) జన్మించినందుకు బీబీ మర్యమ్‌కు ఎందుకు దు:ఖం కలిగింది?
4. పసికందు మాటలకు గాను మంచివారిపై ఎలాంటి ప్రభావం పడింది?
5. హజ్రత్ ఈసా (అ) తన జాతి వారికి అల్లాహ్ ప్రసాదించిన ఏ ఏ చిహ్నాలను ప్రదర్శించారు?
6. హజ్రత్ ఈసా (అ) ఇచ్చిన సందేశాన్ని బనీ ఇస్రాయీలీయులు ఎందుకు విశ్వసించలేదు?
7. బనీ ఇస్రాయీలీయులు హజ్రత్ ఈసా (అలై)తో ఇలా వ్యవహరించారు?

**(ఆ) ఈ క్రింద ఇచ్చిన వాక్యాలను శ్రద్ధగా చదివి సరైన వాటి ముందు ( ) గుర్తును, తప్పు వాక్యాల ముందు ఉన్న బాక్సుల్లో ( )గుర్తును వేయండి.**

1. హజ్రత్ ఈసా (అ) ఇస్మాయీల్ (అ) వంశానికి చెందినవారు. ( )
2. హజ్రత్ ఈసా (అ) తన తరువాత ప్రియప్రవక్త (స) ఆగమనం గురించి శుభవార్తనిచ్చారు. ( )
3. హజ్రత్ ఈసా (అ)ని అల్లాహ్ తిరిగి వాపసు తీసుకున్నారు. ( )

# 22. దుఆ

ఓ ప్రభూ!
నా బాహువులలో బలం పెంచు
నా రక్తంలో ప్రేరణ కలిపించు
నా జీవితంలో ఉద్యమం ప్రసాదించు
  నీ ధర్మం వ్యాపింపజేస్తాను
  విశ్వాన్ని సన్మార్గంపై నడిపిస్తాను
నా పలుకులలో ఇవ్వు ప్రభావం
ప్రసాదించు నాకు విద్యాబలం
నేర్పించు నాకు నీ సాంకేతిక జ్ఞానం
  నీ ధర్మం వ్యాపింపజేస్తాను
  విశ్వాన్ని సన్మార్గంపై నడిపిస్తాను
కావాలని ఉంది నేను నీ పూజారి
ఉత్సుకత ఉంది ప్రాణదానం ఇవ్వాలని
ఓ ప్రభూ! చేసికో నన్ను నీ సిపాయి
  నీ ధర్మం వ్యాపింపజేస్తాను
  విశ్వాన్ని సన్మార్గంపై నడిపిస్తాను

**(సమాప్తం)**

4. బీబీ మర్యమ్ (అ) గదిలోకి ఆహార పదార్థాలను జిన్ను తీసుకుని వచ్చేవాడు. ( )
5. శత్రువుల నుంచి ఒక వ్యక్తిని హతమార్చారు. ( )

**(ఇ) ఈ క్రింది ఖాళీలను పూరించండి.**

1. హజ్రత్ ఈసా (అ) ..............................తరువాత ఎన్నో శతాబ్దాల తరువాత జన్మించారు.
2. హజ్రత్ ఈసా (అ) తల్లి గారి పేరు................................
3. బైతుల్ మఖ్దిస్‌లో....................................బీబీ మర్యమ్‌కు సంరక్షకులుగా ఉన్నారు.
4. హజ్రత్ ఈసా (అ)పై అల్లాహ్ ................................గ్రంథాన్ని అవతరింపజేశాడు.
5. .....................................ఈసా (అ) తెచ్చిన ధర్మాన్ని ప్రచారం చేశారు.

